ఇప్పుడు, కుట్టడానికోసం తయారుగావున్న జీన్స్‌ని తయారుచేసే అందరికన్న పెద్ద నిర్మాతయిచ్చే ఓ చిన్న, తీరైన అందింపు.

అందిస్తున్నాం రఫ్ అండ్ టఫ్ జూనియర్ జీన్స్ ! రఫ్ అండ్ టఫ్ కిట్‌లో మీకు అందుతాయి పూర్తిగా 0.85 మీటర్ల మేలైన డెనిమ్ బట్టా. (132 సెం.మీ. ఎత్తుదాకాగల వారికోసం) గట్టి జిప్, దర్జా అయిన లేబుల్, రివెట్స్, బటన్స్ మరియు ప్యాచెస్. అంటే ఇప్పుడు జూనియర్ కూడా అయిపోవచ్చు రఫ్ అండ్ టఫ్.




JUNIOR

కుట్టడానికోసం- తయారుగావున్న జీన్స్

# పోలియో రహిత భారతదేశం!




లక్ష్యం సమీపిస్తున్నది!
మరో అడుగు ముందుకు వేద్దాం!

జాతీయ వ్యాధినిరోధక తేదీలు :

**డిసెంబర్ 7, 1996**

**జనవరి 18, 1997**

తల్లితండ్రులారా!

* పాపాయి అనారోగ్యంతోనో, విరోచనాలతోనో ఇబ్బంది పడుతున్నప్పటికీ,
* పాపాయికి అంతకుముందే పోలియో చుక్కలు వేయించి ఉన్నప్పటికీ,

నూటికి నూరుశాతం పరిరక్షణ సాధించడానికి



**గుర్తుంచుకోండి!**

జాతీయ వ్యాధినిరోధక తేదీలలో మీ (ఐదేళ్ళలోపు) పిల్లలను సమీప వ్యాధినిరోధక శిబిరం/ కేంద్రానికి తీసుకుపోయి

**ఓరల్ పోలియో వాక్సిన్**

**రెండు అదనపు చుక్కలు వేయించండి!**



దేశభవిష్యత్తు –ఆరోగ్యవంతులైన మన పిల్లల భవిష్యత్తు మీదే ఆధారపడి ఉన్నది!




**క్రీ.శ. 2000 నాటికి**
**పోలియో రహిత**
**భారతదేశాన్ని**
**సృష్టించడానికి కృషి చేద్దాం!**



# మీ క్రికెట్ హీరోని కలవండి నేడు!



World Cup-96 Achievers Collection

# FREE

**Cricketer Card With Every Pack**



రూ. 13.50 మాత్రమే !




- రుచిగలది
- పొదుపైనది
- చేయడం తేలిక

పిల్లల్లారా, త్వరపడండి!
ఈ సదుపాయం 28
ఫిబ్రవరి, 1997 వరకూ.



క్రికెట్ ఆడే ఉత్సాహంగల పిల్లల్లారా, వినండి!

మీకు మనసైన రస్నా స్ప్రెడ్ మేకర్ ప్యాక్ తెరవడంతోటే ఉరకవేసే ఉత్సాహం మొదలవుతుంది.

మీ మమ్మీ 500 గ్రాముల రుచిగల స్ప్రెడ్ మీకోసం చేసిపెట్టేదాని సంగతి కాదు, మేముచెప్పేది. ఈ సారి ఎంతో ప్రత్యేక మైనది ఇంకొకటిఉంది కేవలం మీకోసం. మీరు మనసుపడే రస్నా స్ప్రెడ్ మేకర్ ప్రతి ప్యాక్‌లోనూ ఉత్సాహం రేకెత్తించే ఒక క్రికెటర్ కార్డ్‌వుంది. అదికూడా, ఉచితంగా!!

ఇక బోనస్ ఏమిటంటే, మీరు కావాలని కోరుకునే రుచిగల స్ప్రెడ్ వుండనేవుందిక! ఇక ఆ శాండ్‌విచ్‌ని, చపాతీనీ లేదా పూరీని రుచిభరితంగా చేసుకోండి - రస్నాస్ప్రెడ్ మేకర్‌తో.

ప్యాక్‌లు యీ ఆఫర్ లేకుండా కూడా లభ్యమవుతాయి.

Mudra:EAMR:9610 Tel.



# సంచయిక - బాలల బ్యాంక్
# స్వయం సమృద్ధి - సౌభాగ్యానికి దూరదృష్టి




విద్యార్థులచే, విద్యార్థుల భవిష్యత్ కొరకు, విద్యార్థులు నిర్వహించే స్కూల్ బ్యాంక్ '**సంచయిక**' !!

★ భద్రత గల, స్వయం సమృద్ధమైన భవిష్యత్ కోసం చదువుకొనే రోజుల నుండే పొదుపు చేయటం అలవాటు చేసుకోండి.

★ **VI** వ తరగతి నుండి నెలకు రూ. **10/-** చొప్పన **5** సంవత్సరాల రికరింగ్ డిపాజిట్ అకౌంట్‌లో చెల్లించండి. మీ స్కూలు నుండి వెళ్ళిపోయేటప్పుడు రూ. **833.40** పైॱను పొందండి. ఈ సొమ్ము మీ కాలేజి ఖర్చులకు ఉపయోగపడుతుంది.

★ సంచయిక **5.5%** వడ్డీనందిస్తుంది.

★ అవసరమైనప్పుడు నగదు తీసుకునే సౌకర్యం.

★ అకౌంట్ రిజిష్టర్లు ఉచితంగా పాఠశాలలకు సరఫరా చేయబడతాయి.

★ మీ స్కూల్ సేవింగ్స్ బ్యాంక్ **"సంచయిక"** లో నేడే చేరండి.

**ఇతర వివరాలకు మీ స్కూలు హెడ్‌మాస్టరును లేదా కలక్టరు కార్యాలయంలోని ప్రత్యేక తహసిల్దార్ గారిని సంప్రదించండి.**





**కమీషనర్ :**
**చిన్న మొత్తాల పొదుపు & రాష్ట్ర లాటరీలు,**
తిలక్‌రోడ్, ఆబిడ్స్, హైదరాబాద్
ఫోన్ : **232939/234412**

## మీ భద్రతే మా లక్ష్యం.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి

## బాలలహక్కుల పరిరక్షణ



మరొక బాలలదినం వచ్చింది, వెళ్ళింది. ఎప్పటిలాగే విద్యార్థినీ విద్యార్థుల పోటీలు, బహుమతులు, ఊరేగింపులు, ఉపన్యాసాలతో ఈ బాలల దినోత్సవం కూడా గడిచిపోయింది. అయినా, ఒక్క బాలల దినం సందర్భంగా మాత్రమే బాలల భవిష్యత్తు గురించీ, హక్కుల గురించీ మాట్లాడితే చాలా? అన్నది ముఖ్యమైన ప్రశ్న.

పెద్దలకు లాగానే పిల్లలకు కూడా కొన్ని హక్కులను కల్పించాలని ఐక్యరాజ్య సమితి ఆరేడేళ్ళ క్రితం ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసింది. ఆ సమావేశం నిర్దేశించిన బాలల హక్కులు అమలు చేయ డానికి సభ్యదేశాలన్నీ కృషిచేయాలని ఆదేశించింది.

ఈ విషయంగా ఇటీవల మన భారత ప్రతినిధి ఒకరు ఐక్యరాజ్యసమితిలో ఒక ముఖ్యమైన ప్రశ్నను లేవనెత్తారు. 1989వ సం॥ సమావేశం సిఫా ర్సులను ఏఏ దేశాలు ఎంతవరకు అమలు చేశాయో పరిశీలించాలి అన్నారు ఆయన. ఈ విషయంలో సాధించిన ప్రగతిని పరిశీలించ డానికి ఐదేళ్ళకొకసారి ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేయాలని కూడా ఆయన సూచించారు.



పిల్లలందరికీ విద్య, బలవంతమైన చాకిరీ నుంచి విముక్తి – అనేవి రెండు ముఖ్యమైన బాలల హక్కులు. అయితే, అనధికార వర్గాల అంచనా ప్రకారం మనదేశంలో దాదాపు ఒక కోటి మంది పిల్లలు బడికి వెళ్ళడం లేదు. వాళ్ళేదో కూలిపనులు చేయడం, సోమరులుగా తిరుగుతూ సంఘవ్యతిరేక శక్తులుగా మారడం జరుగుతున్నది. మనదేశం 1986వసం॥లో బాలకార్మికుల చట్టం చేసింది. ఇది పిల్లలను పనులలోకి తీసుకోరాదనీ, ఒకవేళ తీసుకున్నా వారికి కష్టమైన పనులు ఇవ్వరాదనీ చెబుతున్నది. అయినా, మనదేశంలో పిల్లలు కష్టమైన పనులు చేయాలని నిర్బంధించబడుతున్నారు.పైరెండు హక్కులను ఒక్క దేశంలోనే అమలు చేయలేక పోతున్నాం.మరి ప్రపంచవ్యాప్తంగా అమలు చేయాలంటే, అంతర్జాతీయ సంస్థ ఎటు వంటి చర్యలు తీసుకోవాలో తీవ్రంగా ఆలోచించడం చాలా అవసరం.

సంపుటి : 99    డిసెంబర్ '96    సంచిక : 6

విడిప్రతి : 6.00    సంవత్సర చందా : 72.00



## వార్తలు - విశేషాలు:

# అందరికీ ఆహారం

ఇటలీ రాజధాని రోమ్ నగరంలో నవంబర్ నెలలో ఐదు రోజుల పాటు ప్రపంచ ఆహార మహాసభ జరిగింది. ఈ మహాసభలో దాదాపు 190 దేశాలు పాల్గొన్నాయి. నలభై దేశాల నుంచి దేశాధ్యక్షులూ, మరి నలభై దేశాల నుంచి ప్రధాన మంత్రులూ, మిగిలిన దేశాల నుంచి ఆయాదేశాల ప్రతినిధులూ ఈ సభలో పాల్గొన్నారు.

ప్రపంచం నుంచి ఆకలిని నిర్మూలించాలనడంలో ప్రతినిధులలో ఎవరికీ భిన్నాభిప్రాయాలు లేవు. కాని, ఎప్పుడు నిర్మూలించగలమన్న విషయంలో మాత్రం ఈ సమావేశంలో పలువురు భిన్నాభిప్రాయాలను వెలిబుచ్చారు. క్రీ.శ. 2000 సం॥ జనవరి నాటికి ప్రపంచంలో ఆకలితో అలమటించే వారే ఉండకూడదని మన భారత ప్రధాని దేవెగౌడ కాంక్షించారు. అంటే, మూడేళ్ళ లోగా ఆకలిని రూపుమాపాలని ఆయన ప్రపంచ నాయకులకు పిలుపునిచ్చారు!

ఆకలి బాధ నుంచి బయటపడడం అందరికీ ప్రాథమిక హక్కు అని రోమ్ సమావేశం రూఢి చేసింది. ప్రస్తుతం ప్రపంచం మొత్తం మీద దాదాపు 84 కోట్ల మంది ఆకలితో అలమటిస్తున్నారనీ, వచ్చే ఇరవైయేళ్ళలో ఈ సంఖ్యను సగానికి తగ్గించాలనీ ఈ సమావేశం ప్రకటించింది. ఇరవై రెండేళ్ళ క్రితం జరిగిన సమావేశం కూడా దాదాపు ఇటువంటి నిర్ణయాన్నే ప్రకటించి నప్పటికీ భూమిమీద ఆకలి తీరలేదు. ఆకలి చావులు తప్పడం లేదు– అన్నది చేదు నిజం! ఒకవేళ ఈ ప్రకటన ప్రకారమే వచ్చే ఇరవై యేళ్ళలో సగంమంది ఆకలి తీరినా మిగిలిన 42 కోట్ల ప్రజల ఆకలి తీరేదెప్పుడు? అన్నది సమాధానం కనిపించని హృదయ విదారకమైన ప్రశ్న!

అసలు ఆహారం కొరత ఎందుకు ఏర్పడుతున్నది అని ప్రశ్నిస్తే దానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. అవసరానికి చాలినంత పంటలు పండకపోవడం; పండిన పంటలు అందరికీ అందుబాటులో లేకపోవడం– ముఖ్యమైన కారణాలుగా చెప్పవచ్చు. జనాభా పెరుగుదల మరొక ప్రధాన కారణం.

మన దేశంలో న్యాయమైన ధరలకు ఆహార పదార్థాలను ప్రభుత్వమే రేషన్‌షాపుల ద్వారా సరఫరా చేస్తున్నది. అది ఆర్థికంగా వెనుకబడి ఉన్న వారికి ఉద్దేశింవ బడినది. సరఫరా కూడా చాలినంత లేదన్న విషయం అందరికీ తెలిసినదే.




ఆహార పదార్థాలు వృధా చేయడం కూడా ఆహారం కొరతకు ఒక కారణంగా చెప్పవచ్చు. పంటలు బాగా పండే దేశాలు కొన్ని ఎక్కువ ధర కావాలన్న వ్యాపార దృష్టితో ఆహార ధాన్యాలను నడి సముద్రంలో పడ వేయడం కూడా జరుగుతున్నది!

ఇక రోమ్ సమావేశ ప్రకటన విషయానికివస్తే- - అది ప్రకటన మాత్రమే తప్ప ప్రపంచ దేశాల మీద ఎటువంటి ఒత్తిడి తీసుకువచ్చే అవకాశం లేదు. కాబట్టి అందరికీ ఆహారం లభించాలంటే ఆ లక్ష్యసాధనకు ప్రభుత్వాలతో పాటు ప్రపంచ ప్రజలందరూ కృషి చేయాలి. ఈ సందర్భంగా మనమందరం కనీసం ఒక నిర్ణయం తీసుకుందాం: అందరికీ ఆహారం లభించాలి. అందుకు మనం ఆహారం వృధా చేయకూడదు. ఉన్నవారు లేని వారికి చేతనైన సాయం చేద్దాం. ఆకలి తీర్చడానికి ఆదుకుందాం.



# రాగి బిందె భూతం

సీతయ్య తాగుబోతు. ఉన్న పొలం, ఇల్లు అమ్మేశాడు. సరైన వైద్యం లేక భార్య చనిపోయింది. ఉన్న ఒక్కగానొక్క కొడుకు రాజయ్యనూ చలపతికి బానిసగా అమ్మేశాడు. ప్రతిఫలంగా చలపతి, సీతయ్యకు రోజూ తాగడానికి డబ్బిచ్చేవాడు.

ఒకరోజున సీతయ్య చనిపోయాడు. రాజయ్య, తండ్రికి దహనకాండ జరిపించి చలపతి వద్దకు వెళ్ళి, "అయ్యా! ఇంతకాలం తమరు చేసిన సాయం కలకాలం గుర్తుంచుకుంటాను. ఈ ఊళ్ళో మా అమ్మ చచ్చిపోయింది. మా అయ్య చెడిపోయాడు. నేను దిక్కులేని పక్షినయ్యాను. ఇక్కడ నేనుండలేను. ఎవరూ ఎరగనిచోటుకు పోయి గుట్టుగా బ్రతుకుతాను," అన్నాడు.

చలపతి వాడి మీద జాలి నటిస్తూ, "నీ బాధ నా కర్థమయ్యింది. కానీ నా పరిస్థితి నువ్వర్థం చేసుకో. తాగుడు పేరు చెప్పి మీ నాన్నకున్న ఆస్తంతా ఖర్చయిపోయింది. ఆ తర్వాత మీ నాన్న తాగుడు ఖర్చు, నేను భరించాను. ఆవిధంగా నాకెంత ఖర్చయిందో నువ్వూహించలేవా?" అన్నాడు.

"అయితే, నేనేం చేయాలి?" అన్నాడు రాజయ్య.

"మీ నాన్న సీతయ్య నిన్ను నాకు బానిసగా అమ్మేశాడు. అయినా నేను నిన్ను బానిసగా చూడను. రెండుపూటలా తిండి పెడతాను. ఇంట్లో పనులన్నీ చెయ్యి. లేదా నేను చెప్పిన మూడు పనులు చేసి శాశ్వతంగా స్వేచ్ఛను పొందు," అన్నాడు చలపతి.

రాజయ్య ఆ పనులేమిటో చెప్పమని అడిగాడు.

ఊరి చివర కొండ ప్రాంతాల చలపతికి నాలుగెకరాల మెట్టపొలం ఉన్నది. దాన్నెవరూ కొనరు. అందులో పంటలు పండవు. రాజయ్య ఆ పొలాన్ని సాగు చేయడం మొదటి పని.

"వసుంధర"

"పంటలు పండని పొలాన్ని నేనెలా సాగు చేయగలను. ఈ పని చెప్పడం న్యాయం కాదు," అన్నాడు రాజయ్య.

"ఒళ్ళొంచి కష్టపడితే, ఎలాంటి భూమినైనా సాగు చేయవచ్చు. అంత కష్టపడటం ఎవరికీ ఇష్టం లేదు. నువ్వు స్వేచ్ఛ కావాలనుకుంటే-కష్టపడు! బలవంతమేమీ లేదు. అంతా నీ ఇష్టం," అన్నాడు చలపతి.

సరేనని రాజయ్య కొన్నాళ్ళపాటు ఆ మెట్టపొలంలో కష్టపడి పని చేశాడు. ఒక రోజున వాడు తవ్వుతూంటే, ఒకచోట ఖంగు మని చప్పుడైంది. అదేమిటా అని, వాడు మరికాస్త లోతుకు తవ్వి చూస్తే, అక్కడ ఒక రాగిబిందె దొరికింది. దాని మూత తియ్యగానే, అందులోంచి పెద్ద పొగ వచ్చింది. చూస్తూండగానే, ఆ పొగ భూతంగా మారి, "నీకేం కావాలో చెప్పు. నీ కోరిక తీర్చుతా," అన్నది.

రాజయ్య ఆశ్చర్యపడి, "ఎవరు నువ్వు? నా కోరిక తీర్చాల్సిన అవసరం నీకేమిటి? అన్నాడు.

"నేను రాగిబిందె భూతాన్ని! ఈ రాగిబిందెకు అద్భుత శక్తులున్నాయి. ఆ శక్తులతో మంచివారికి సాయపడడం నా ధర్మం," అన్నదా భూతం. "నేను మంచివాడినని నీకెలా తెలిసింది?" అని అడిగాడు రాజయ్య మరింతగా ఆశ్చర్యపోతూ.

"ఈ రాగిబిందెకు అద్భుతశక్తులున్నాయని ముందే చెప్పాను కదా! మంచి వాళ్ళు బిందెను తాకగానే, అది నన్ను ప్రేరేపిస్తుంది," అన్నది రాగిబిందెభూతం.

"అసలు నీవీ రాగిబిందెలో ఎలా ప్రవేశించావు?" అని అడిగాడు రాజయ్య.

"ఆ గొడవంతా నీకెందుకు? నువ్వు చక్కగా నా సాయం పొంది సుఖపడవచ్చు గదా," అన్నది రాగిబిందెభూతం.





TL-FZ



రాజయ్య ఒకక్షణం ఆలోచించి, "అయితే విను! నేనొక బానిసను. స్వేచ్ఛను పొందాలని అష్టకష్టాలూ పడుతున్నాను. నీవీ రాగిబిందెకు బానిసవని నాకు అనుమానంగా ఉంది. నా కష్టాలు తీర్చడానికి, మరొక బానిసను కష్ట పెట్టడం నాకే మాత్రం ఇష్టం లేదు," అన్నాడు రాజయ్య.

"నువ్వు నిజంగా చాలా మంచివాడివి. నీకు నా కథ చెబుతాను, విను!" అంటూ భూతం చెప్పడం మొదలుపెట్టింది:

ఒకప్పుడు శీతలపురంలో దుర్జయుడనే వ్యాపారి ఉండేవాడు. వాడు పరమ దుష్టుడు. స్వార్థపరుడు. అన్నదమ్ముల ఆస్తులన్నీ కాజేసి, వాళ్ళను ఇంట్లోనుంచి తరిమేశాడు. నమ్మిన ప్రాణస్నేహితుడు గోపీనాథుణ్ణి కూడా దారుణంగా మోసంచేసి కట్టుబట్టలతో సాగనంపాడు.

గోపీనాథుడు అడవికి పోయి తపస్సు చేసి దివ్యశక్తులు సంపాదించి తిరిగి వచ్చి, దుర్జయుణ్ణి కలుసుకుని, "నువ్వు చాలా పాపాలు చేశావు. వాటినుంచి విముక్తి పొందే మార్గం చెబుతాను. అందుకు ముందుగా నీ సర్వస్వాన్నీ పేదలకు దానం చెయ్యి," అన్నాడు.

దుర్జయుడు సరేనని గోపీనాథుడికి చెప్పాడు.

వాడు తన ఆస్తిపాస్తులన్నీ ఎరిగున్న వారికి దానం చేసి, వాళ్ళు మళ్ళీ తనకు తిరిగిచ్చే విధంగా రహస్య ఒప్పందం చేసుకున్నాడు.

గోపీనాథుడు, దుర్జయుడి ముందొక రాగి బిందె ఉంచి, "దీనికి అద్భుతశక్తులున్నాయి. మంచి మనసుతో దీన్ని తాకితే, నీ పాపాలన్నీ హరించుకుపోతాయి. అప్పుడు మనమిద్దరం అడవికి వెళ్ళి,మిగిలిన జీవితకాలాన్ని గడుపుదాం," అన్నాడు.

దుర్జయుడా బిందెకున్న అద్భుతశక్తులేమిటో అడిగి తెలుసుకుని, "నేను అడవికి రాను. ఈ బిందెను నాకు అప్పగించి వెళ్ళు," అన్నాడు.

ఇందుకు గోపీనాథుడు ఒప్పుకోలేదు. దుర్జయుడా బిందెను బలవంతంగా తీసుకోబోయాడు. అంతే! వాడొక భూతంగా మారిపోయి బిందెలోకి వెళ్ళిపోయాడు.

గోపీనాథుడు నిట్టూర్చి, "స్నేహితుడివి కదా అని సాయపడాలనుకున్నాను. నీకింకా విముక్తి యోగం కలగలేదు. ప్రస్తుతానికి నిన్ను భూస్థాపితం చేస్తాను. నీలో మంచి బుద్ధి పుట్టే నాటికి, నీకొక మంచివాడు తటస్థ

పడతాడు. వాడికి సాయపడు. నీ పాపాలు తొలగి, నీకు మోక్షం లభించవచ్చు," అన్నాడు.

ఆ విధంగా రాగిబిందెతో సహా భూస్థాపితమైన దుర్జయుడు ఎన్నో ఏళ్ళుగా గోపీనాథుడికి శాపనార్థాలు పెడుతూనే ఉన్నాడు. ఇదంతా జరిగి నూరేళ్ళకు పైగా అయిందేమో! ఈ మధ్యనే వాడిలో పశ్చాత్తాపం బయల్దేరింది. మంచివాళ్ళకు సాయపడాలన్న కోర్కె పుట్టింది.

"అయితే నీ పేరు దుర్జయుడన్న మాట! నా కథ కూడా విను," అంటూ రాజయ్య, భూతానికి తన కథ చెప్పాడు.

భూతం వెంటనే, "అద్భుతశక్తులున్న నాకు ఏ పనీ కష్టం కాదు. ఈ మెట్టపొలాన్ని సాగు చెయ్యడం చిటికెల మీద పని!" అని ఏవో మంత్రాలు చదివింది.

కాసేపటికి ఆ పొలం కంకులు దిగిన వరిమొక్కలతో నిండిపోయింది.

"ఇప్పుడు నేనేం చేయాలి?" అన్నాడు రాజయ్య.

"నా గురించి నీ యజమానికి చెప్పకు. నేనీ రాగిబిందెలో ఇక్కడే ఉంటాను. నువ్వు వెళ్ళి నీ యజమానిక్కావలసిన మిగతా రెండు పనులూ అడిగి తెలుసుకో," అన్నది భూతం.

రాజయ్య, చలపతి వద్దకు వెళ్ళి తను పొలం సాగు చేశాననీ, అప్పుడే ధాన్యం కంకులు వేశాయనీ చెప్పాడు. ఇది విన్న చలపతి ఆశ్చర్యపోయి, ఆ విడ్డూరం చూడాలని పొలానికి బయలుదేరాడు. చలపతితో పాటు ఆయన కూతురు శారద కూడా వచ్చింది. ఇద్దరూ పొలం చేరి పంట చూసి విస్తుపోయారు.

"ఇక నాకు ఆ రెండో పనేమిటో చెప్పండి!" అని అడిగాడు రాజయ్య.

"నువ్వు సామాన్యుడివి కాదు. నీకేవో అద్భుతశక్తులున్నాయి. లేకుంటే ఇది సాధ్యం





కాదు!" అంటూ చలపతి తనపైమీది కండు వాను నేల మీద పరిచి, "దీన్నిండా కాసుల వర్షం కురిపించు!" అన్నాడు.

రాజయ్య రాగిబిందె భూతాన్ని కలవాలను కుంటూండగానే, ఆ కండువా నిండా బంగారు కాసులు కురిశాయి.

చలపతి ఆశ్చర్యానికి అంతులేదు.

"ఇక మీ మూడో పని చెప్పండి!" అన్నాడు రాజయ్య.

చలపతి ఏదో అనేలోగా శారద చటుక్కున, "నువ్వు నన్ను పెళ్ళి చేసుకో," అనడిగింది.

"అందుకు నేను సిద్ధమే! కానీ ముందు నాకు స్వేచ్ఛ కావాలి," అంటూ రాజయ్య, చలపతి వంక చూశాడు.

చలపతి వాడి వంక తీవ్రంగా చూసి, "ఏవో నాలుగు గారడీ చిట్కాలు నేర్చినంత మాత్రాన, నాకు అల్లుడివి కావాలనుకుంటు న్నావా? మరిచిపోకు, నువ్వు నాకు బానిసవు. అభం శుభం తెలియని నా కూతురు మాటలు లెక్కలోకి రావు. నువ్వు చేయాల్సిన మూడో పని నేను చెప్పాలి!" అన్నాడు.

"సరే, తమరే చెప్పండి," అన్నాడు రాజయ్య నెమ్మదిగా.

"నన్ను కలకాలం ఇదే విధంగా సేవించు కోగలిగే బానిస నాకు కావాలి. అది నువ్వ యినా సరే లేక అలాంటి బానిసను వేరెవరి నైనా ఏర్పాటు చేసినా సరే," అన్నాడు చలపతి వెంటనే.

ఈ మాటలు వింటూనే చలపతి చాలా జిత్తులమారి అనీ, తనకిక బానిసత్వం నుంచి విముక్తి లేదనీ అనుకుని రాజయ్య నిరాశ పడిపోయాడు. అయితే, అంతలో వాడి బుర్రలో ఏదో తళుక్కుమన్నది. వాడు చలపతితో, "అయ్యా! మీకొక బానిస కావాలి. మీకు అంటే, ప్రాణమున్న ఈ చలపతి శరీరానికి! అంతే కదూ!" అన్నాడు.

"అవును!" అన్నాడు చలపతి.

"అలాగే జరుగుతుంది. మీకు వేరే భానిస నేర్పాటు చేస్తే, నాకు స్వేచ్ఛ నివ్వాలి. శార దను నాకిచ్చి పెళ్ళి చేయాలి. సరేనా?" అని అడిగాడు రాజయ్య.

"సరే!" అన్నాడు చలపతి.

అప్పుడే తనకు వాడితో పెళ్ళి కుదిరి పోయినట్టుగా సిగ్గుపడి, శారద అక్కణ్ణించి ఇంటికి పారిపోయింది.

రాజయ్య, చలపతితో, "తమరు ఒక క్షణం ఆగండి. బానిస నేర్పాటు చేస్తాను," అన్నాడు.

చలపతి అక్కడే కూర్చుని, వానగా కురిసిన బంగారు కాసులు లెక్కపెట్టసాగాడు.

రాజయ్య రాగిబిందె భూతం వద్దకు వెళ్ళి జరిగింది చెప్పి, "చలపతి పరమ ధూర్తుడు. ఆయనకు మనిషిగా బ్రతికే అధికారం లేదు. నువ్వు ఒకప్పటి చెడ్డగుణాలు విడిచిపెట్టి మంచివాడివయ్యావు. ఇప్పుడు మీరిద్దరూ స్థానాలు మారండి. చలపతి ఆత్మ భూతమై రాగిబిందెలో ప్రవేశిస్తే, నువ్వు చలపతి శరీరంలో ప్రవేశించి, మంచి మనిషిగా ఆయువున్నంత కాలం జీవించు. నీకూ, నాకూ ఒకేసారి స్వేచ్ఛ లభిస్తుంది," అన్నాడు.

రాగిబిందె భూతంగా ఉన్న దుర్జయుడు, రాజయ్య తెలివిని మెచ్చుకుని వాడు చెప్పినట్టే చేసి, తనే చలపతి అయ్యాడు. అప్పుడు రాజయ్య, "అయ్యా! ప్రాణమున్న ఈ చలపతి శరీరానికి బానిసగా రాగిబిందె భూతాన్నిస్తున్నాను. నేను చలపతి చెప్పిన మూడో పని చేసినట్టేగా– ఇక నాకు స్వేచ్ఛ నివ్వండి," అన్నాడు.

అప్పటికి చలపతి ఆత్మ భూతమై రాగిబిందెలో చేరి బయటకు రాలేక లబోదిబోమంటున్నది. చలపతి రూపంలో ఉన్న దుర్జయుడు, ఆయనకు జరిగినదంతా చెప్పి, "స్వార్థం మితిమీరితే ఎవరు తీసుకున్న గోతిలో వారే పడతారు. నీకు బానిస కావాలనుకుని నువ్వే బానిసవయ్యావు. అయితే, నీ వంటి బానిసతో నాకేమీ పని లేదు. కాబట్టి రాగిబిందెతో సహా నిన్ను భూస్థాపితం చేస్తాను. నీ, నా వంటివాళ్ళను సన్మార్గులుగా మార్చడంలో, ఈ ప్రపంచానికి ఉడతాభక్తి సాయం చేయాలనే, గోపీనాధుడీ రాగి బిందెను సృష్టించాడు. తొందరగా నీ బుద్ధి మార్చుకో!" అన్నాడు.

రాగిబిందెను భూస్థాపితం చేశాక, వాళ్ళిద్దరూ ఇల్లు చేరుకున్నారు. రాజయ్యకూ, శారదకూ పెళ్ళి జరిగింది. ఆ పెళ్ళి జరిగిన కొద్ది రోజులకే చలపతి రూపంలో ఉన్న దుర్జయుడికి ఆయువు తీరిపోయింది.

తను సుఖపడుతూ, పదిమందిని సుఖపెడుతూ కలకాలం జీవించిన రాజయ్య కారణంగా, ఎవరికీ రాగిబిందె భూతాన్ని దర్శించే అవకాశం రాలేదు.

భూస్థాపితమైన రాగిబిందె భూతం మరొక చలపతి కోసం ఎదురుచూస్తున్నది.



# కీలెరిగి వాత

ఏటికట్ట నానుకుని వున్న పెనుమూడి గ్రామంలోని రైతులందరికన్నా రాయప్ప పెద్ద రైతు. అయినా, ఆయనలో పిసినిగొట్టుతనం పాలెక్కువ. ఒకసారి, ఆయన వడ్ల బస్తాలుంచే గదిలో పాము దూరింది. అది చూసిన నౌకరొకడు, పరుగు పరుగున పోయి రాయప్పకీసంగతి చెప్పాడు. ఆయన వాడికేసి చీదరించుకుంటూ చూసి, "పోయి, కర్రతో నాలుగు బాది బయట పారెయ్యి, పో!" అన్నాడు.

"అయ్యా, అది మామూలు పాము కాదు. గోధుమవన్నె తాచు. దాన్ని చంపడం నా వల్ల కాదు. పాముల పాపయ్యను పిలుచుకు వస్తాను," అన్నాడు.

రాయప్ప సరేనన్నట్టు తలాడించాడు. పాపయ్య వచ్చి, వడ్లబస్తాల మధ్య దాక్కున్న పామును పట్టి బుట్టలో పెట్టి, రాయప్పను పదిరూపాయలడిగాడు.

ఆయన, పాపయ్యకేసి కోపంగా చూస్తూ, "ఒరే, నువ్వు రావడం, పామును పట్టడం– అంతా పది నిమిషాలు కూడా కాలేదు. నువ్వు నిమిషానికి రూపాయి చొప్పున అడుగుతున్నావన్న మాట!" అన్నాడు.

"అయితే, తమ పామును తమరే ఉంచుకోండి!" అంటూ పాముల పాపయ్య పామును బుట్టలోంచి తీసి బయటకు వదిలాడు.

పాము మళ్ళీ పోయి బస్తాల మధ్య దాక్కున్నది. ఇది చూసి రాయప్ప బెంబేలు పడిపోతూ, "ఒరే! ఒరే! ముందు దాన్ని బయటికి లాగు. అలాగే పదిరూపాయలిస్తాను," అన్నాడు.

అందుకు పాపయ్య తాపీగా, "అయ్యా! పామును ఒకసారి పట్టినందుకు పదిరూపాయలడిగాను. ఇప్పుడు రెండోసారి పట్టబోతున్నాను. ఇరవై రూపాయలివ్వవలసి ఉంటుంది. సరేనా?" అన్నాడు కీలెరిగి వాత పెట్టినట్టు.

రాయప్ప, వాడికి ఇరవై రూపాయలిస్తూ, "ఒరే, నువ్వు నిమిషానికి రూపాయి సంపాయించేంత శక్తివంతుడివి! ఈ లెక్కన త్వరలోనే నువ్వు, గ్రామంలోని రైతులందరినీ మించిన వాడివైపోతావు!" అన్నాడు ఈర్ష్యపడుతున్న వాడిలా.

– ఎన్. శివనాగేశ్వరరావు






## 18

[రూపధరుడి పని ముగిసింది. తన భార్యను పెళ్ళాడే ఉద్దేశంతో ఇంట చేరి తన సొత్తంతా తినేస్తున్న గ్రీకు రాజకుమారులందరినీ అతనూ, అతని కొడుకూ కలిసి అటకాయించి మారణహోమం చేసేశారు. ఇందుకుగాను రూపధరుడు కేవలం తన పరాక్రమం పైనే ఆధారపడలేదు. తన యుక్తి పైన కూడా ఆధారపడ్డాడు. దేవతలు కూడా ఆనాడు అతని పక్షాన ఉన్నారు. కాని అప్పటికీ రూపధరుడి సమస్యలు సాంతం తీరిపోలేదు. తరవాత–]

ఇదంతా జరుగుతున్నంతసేపూ పద్మముఖి నిద్రపోతున్నది. బహుకీర్తి ఆమె శయ్యామందిరానికి వెళ్ళి, "లే, లే! ఇంకేం నిద్రపోతావు? నీ భర్త వచ్చాడు. దుష్టసంహారం పూర్తి అయింది. నీకు మంచిరోజులు వచ్చాయి!"అని ఆమెను హడావిడిగా నిద్రలేపింది.

మొదట పద్మముఖి తన చెవులను నమ్మలేకపోయింది. ఆమె అనుమానంతో లేచి, "విధిచర్యలు చాలా ఆశ్చర్యంగా ఉంటాయి గద. అయినా, ఆ దుర్మార్గులను కడతేర్చిన మనిషిని చూస్తాం పద!" అన్నది. ఆమె ముసలిదాన్ని వెంటబెట్టుకుని కిందికి దిగివచ్చి రూపధరుడికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నది. ఆమె ముఖాన ఏ భావమూ లేదు. ఆమె తనను పలకరిస్తుందనుకున్న రూపధరుడు ఆమె మౌనం చూసి ఆశ్చర్యపోయాడు.

"అమ్మా, నువ్వు మనిషివా,రాయివా? నాన్నను పలకరించక, బెల్లం కొట్టిన రాయి లాగా ఉండిపోయావేం?" అన్నాడు ధీరమతి తల్లితో.



"అయితే ఏం చెయ్యాలో నువ్వే ఆలోచించు. ఆలోచనకు నిన్ను మించిన వాడెవడున్నాడూ?" అన్నాడు ధీరమతి.

"సరే, నా ఆలోచన విను. మొదట అందరూ స్నానాలు చేసి మంచి బట్టలు వేసుకోవాలి. తరవాత నృత్యగీతాలు వాయించాలి; అవి విని లోపల పెళ్ళి జరుగుతున్నదని బయటివాళ్ళు అనుకోవాలి. వీళ్ళంతా చచ్చిన మాట పైకి ఏమాత్రమూ పొక్కరాదు. ఈలోపల మనం ఊరుదాటి పల్లెలలోకీ, అరణ్యాలలోకీ వెళ్ళిపోదాం," అన్నాడు రూపధరుడు.

రూపధరుడు చెప్పిన ప్రకారమే అందరూ స్నానాలు చేసి మంచి బట్టలూ, నగలూ ధరించి వాద్యాలతో సహా నృత్యాలు చేయసాగారు. బయట వీధిలో నడిచే జనం, "ఓహో, ఇంత కాలానికి ఈ ఇంటావిడకు మనువు కుదిరినట్టుందే.వెళ్ళిపోయిన మొగుడి కోసం వేచి ఉండలేకపోయింది కాబోలు!" అనుకున్నారు.

"ఏం మాట్లాడమన్నావు, నాయనా? నా గుండె మొద్దుబారిపోయి ఉన్నది. ఆయన నిజంగా మీ నాన్నే అయితే, నేనాయనను తెలుసుకోలేకపోను. ఈ ఇంట్లో మా ఇద్దరికి మాత్రమే తెలిసిన రహస్య విషయాలు చాలా ఉన్నాయి," అన్నది పద్మముఖి.

రూపధరుడు కొడుకుతో, "మీ అమ్మను వేధించకు. ఆవిడ నన్ను పరీక్ష చెయ్యనియ్యి. నేనెవరో ఆమె సులువుగానే తెలుసుకుంటుందిలే. ఈ కుళ్ళు గుడ్డలు చూసి నేను మరెవరో అనుకుంటున్నది. మనం కర్తవ్యం ఆలోచించాలి.నువ్వు ఒక్క మనిషిని చంపితేనే అతని బంధుమిత్రులకు వెరచి దేశం వదిలి పారిపోవాలి.మనం ఈ రోజున ఇథకాలో ఉండే ప్రముఖ యువకులనందరినీ చంపేశాం. ఆ మాట జ్ఞాపకం ఉంచుకో!" అన్నాడు.

రూపధరుడు స్నానం చేసి శరీరమంతా తైలం మర్దించుకున్నాక మరొక మనిషిలాగా అయిపోయాడు. అతను భార్యతో, "ఏం మనిషివి? ఇరవై ఏళ్ళ తరవాత ఇంటికి వచ్చిన భర్తను మరొకతె అయితే ఎంత ఆప్యాయంగా ఆదరించును!" అని ముసలి దాదితో, "నానమ్మా, నాకు పక్క వెయ్యి, పడుకుంటాను!" అన్నాడు.

వెంటనే పద్మముఖి దాదితో, "నానమ్మా, ఆయన మంచం ఇవతలికి తెచ్చి, దానిపైన తోళ్ళూ, కంబళ్ళూ పరుచు!" అన్నది.

రూపధరుడికి ఈ మాట వినగానే కోపం రెచ్చిపోయింది. "నా మంచాన్ని ఎవరు కది

లించారు? అది కదిలే మంచం కాదే!" అన్నాడు అతడు.

ఈ మంచంలో ఒక కిటుకున్నది. రూపధరుడు ఆ ఇల్లు కట్టినప్పుడు, అతని పడక గదిలో ఒక చెట్టుండేది. ఆ చెట్టును కొట్టినప్పుడు అతను దాని బోదెను భూమిలోనే ఉంచి, ఒక కోడులాగా తయారుచేసి మిగిలిన కోళ్ళూ, పట్టెలూ దానికి అమర్చి మంచం తయారుచేశాడు. ఈ రహస్యం అతనికి తెలుసునో, లేదో బయటపెట్టించటానికే పద్మముఖి ఆ మాట అన్నది. రూపధరుడన్న మాటతో ఆమె సందేహం నివారణ అయింది. ఆమె తన భర్తను కౌగిలించుకుని, "నా పైన ఆగ్రహించకండి. ఎవరు నన్ను మోసగించుతారో అని నేను భయపడి చస్తున్నాను," అన్నది.

తన భార్య తీసుకున్న జాగర్తకు రూపధరుడు చాలా సంతోషించాడు. ఆ రాత్రి పద్మముఖి తన భర్త నోట అతనికి కలిగిన అనుభవాలన్నీ విన్నది. తెల్లవారే సమయంలో రూపధరుడు తన వంటికి కవచం వేసుకుని ధీరమతిని నిద్ర లేపి అతనితో సహా బయలుదేరాడు. ఎవరూ చూడకుండానే వారు నగరం దాటారు.

వారిద్దరూ రూపధరుడి తండ్రి అయిన పిపీలకుడు ఉండే చోటు చేరారు. ఒకప్పుడు రాజరికం నిర్వహించిన పిపీలకుడు అక్కడ ఇల్లు వేసుకుని, చెట్లూ చేమలూ పెంచుతూ, దారిద్ర్యంతో నివసిస్తున్నాడు. రూపధరుడు తన తండ్రి నౌకర్లతో విందు భోజనం తయారుచెయ్యమని చెప్పి తోటలోకి వెళ్ళాడు.

అక్కడ ముసలి పిపీలకుడు ఒక మొక్క చుట్టూ పాదు తవ్వి బాగు చేస్తూ కనిపించాడు.



ఆయన ధరించి వున్న చొక్కా నిండా మాసికలే.

ఆయనను చూడగానే రూపధరుడి కంట నీరు తిరిగింది. వెంటనే వెళ్ళి ఆయనను కౌగలించుకుని తన సంగతులన్నీ చెప్పేద్దామనుకున్నాడు గాని, ఆయన తనను గుర్తిస్తాడో, గుర్తించడో చూడాలన్న కోరిక కలిగింది. అందుచేత అతను తండ్రిని సమీపించి, "ఏం, తాతా? నీ తోటలో మొక్కలన్నిటికీ ఇంత బాగా పోషణ చేస్తున్నావు గాని, నీకేమీ పోషణ జరుగుతున్నట్టు లేదే? నీ యజమానికి నువ్వు చేసే చాకిరీ తృప్తికరంగా లేదా ఏం?" అన్నాడు.

"ఎవరు, నాయనా, నువ్వా? మీది ఏ దేశం?" అని పిపీలకుడు అడిగాడు. "మాది సంచార దేశంలే, తాతా. అయిదేళ్ళ కిందట

రూపధరుడనే వాడు నాకు తగిలాడు. ఇది ఆయన ఉండే దేశమే నటగా? మళ్ళీ కని పిస్తాడేమో బహుమానా లిచ్చి పుచ్చు కుందామని చూస్తున్నాను!" అన్నాడు రూప ధరుడు.

ముసలివాడు తన కొడుకు పేరు వినగానే మట్టిచేతులు ముఖానికి నొక్కుకుని ఏడవ సాగాడు. రూపధరుడికి గుండె అవిసి పోయింది. అతను తన తండ్రిని కౌగలిం చుకుని, "నేనే, నాన్నా! నా కోసం ఇంకా ఎందుకేడుస్తావు? ఇరవైఏళ్ళు యమయాత నలు పడి దేశానికి తిరిగి వచ్చాను. నా ఇంట చేరి నా భార్యను పెళ్ళాడమని పీడించే దుర్మార్గుల నందరినీ చంపేశాను," అన్నాడు.

"ఎంత పని చేశావురా, నా తండ్రీ! ఇథకా వాళ్ళు నిన్ను బతకనిస్తారా? ఇరుగు పొరుగు దేశాల వాళ్ళను కూడా సాయం తెచ్చి నీ పైకి వస్తారే!" అన్నాడు పిపీలకుడు భయంతో.

"భయపడకు, నాన్నా, వెళ్ళి భోజనం చేద్దాం పద. వంట చెయ్యమని చెప్పాను!" అంటూ రూపధరుడు తండ్రిని ఇంటికి తీసు కువచ్చాడు. అక్కడ రూపధరుడి పందుల కాపరీ, పశువుల కాపరీ వంట సిద్ధం చేసి ఉంచారు. పిపీలకుడు స్నానం చేసి వచ్చే సరికి ఎంతో దృఢంగానూ నిటారుగానూ ఉండటం గమనించి రూపధరుడు ఆశ్చర్య పోయాడు. తరవాత వారంతా కలిసి కూచుని భోజనాలు చేశారు.

ఈ లోపల ఇథకా నగరంలో రూపధరుడు చేసిన హత్యల వార్త కార్చిచ్చులాగా వ్యాపిం చింది. అనేకమంది హాహాకారాలు చేస్తూ ఏడుస్తూ రూపధరుడి ఇంటి చుట్టూ మూగారు. ఎవరి శవాలను వారు గుర్తించి పట్టుకు పోయారు.



చాలా దూరప్రాంతాల నుంచి వచ్చిన వారు తమ బంధువుల శవాలను వాటివాటి దేశాలకు పడవల మీద పంపేశారు.

తరవాత నగరంలో సభ జరిగింది. దుర్బుద్ధి తండ్రి అందరినీ రెచ్చగొట్టాడు. "స్నేహితులారా, ఈ మనిషి చేసిన హత్యాకాండ దారుణమైనది. ఇతను ఎన్నో పడవలనూ, ఎంతోమంది పైకి రావలసిన యువకులనూ వెంటబెట్టుకుని యుద్ధానికి పోయి, పడవలన్నింటినీ పోగొట్టుకున్నాడు. మనుషులందరినీ పోగొట్టుకున్నాడు. ఇప్పుడు ఒంటరిగా తిరిగివచ్చి దేశంలో ఉన్న మంచి యువకులందరినీ తన పొట్టన పెట్టుకున్నాడు. ఈ దుర్మార్గుడు ఏ పైలాస్‌కో, ఎలిస్‌కో పారిపోకముందే మనం పగ తీర్చుకోవాలి. మన కుర్రవాళ్ళను చంపిన హంతకులను శిక్షించకపోతే మన వంశాలకు అది తీరని కళంకమవుతుంది. నా మటుకు నేను చావనైనా చస్తాను గాని అలాంటి అవమానం సహించను. ప్రతీకారానికి ఉపక్రమించండి! కదలండి!" అన్నాడాయన.

ఆయన మాటలు వింటుంటే, ఆయన కన్నీరు చూస్తుంటే ప్రేక్షకుల గుండెలు నీరయ్యాయి.

అయితే, సరిగా ఆ సమయానికే అక్కడికి ఒక మనిషి వచ్చాడు. రూపధరుడు చంపకుండా విడిచిన ఇద్దరిలో ఇతను ఒకడు. అతను ఆ సభతో, "ఇథకా పౌరులారా, నా మాట ఒకటి వినండి. ఆ హత్యాకాండ జరిగినప్పుడు నేనక్కడే ఉన్నాను. రూపధరుడి పక్కన బుద్ధిమతీదేవి నిలబడి వుండటం నేను కళ్ళారా చూశాను. ఈ హత్యాకాండ దైవ నిర్ణయంతో జరిగింది! కాబట్టి మళ్ళీ మనం రక్తపాతానికి పూనుకోవడం సరికాదు," అన్నాడు.



ఈ మాటలకు అక్కడ చేరిన వారందరూ వెలవెల పోయారు.

ఇంకొక వృద్ధుడు లేచి, "జరిగిపోయినదేదో జరిగిపోయింది. ఇంకా ఎందుకు రక్తపాతం చేస్తారు? ఇంతటితో పోనివ్వండి! అసలు తప్పు మీ కొడుకులది. వారిని నిగ్రహించమని నేను మీతో ఏనాడో చెప్పాను; మీరు లక్ష్యపెట్టలేదు. రూపధరుడు తిరిగి రాడన్న ధైర్యంతో మీ వాళ్ళు అతని ఇల్లు కొల్లగొట్టి అతని భార్యకు తీరని అవమానం కలిగించారు; అందుకు వాళ్ళు తగినశిక్ష అనుభవించారు. ఇందులో మరెవరి తప్పూ లేదు," అన్నాడు.

ఈ మాటలతో సగం మంది తృప్తిపడి సభ నుంచి వెళ్ళిపోయారు. మిగిలిన సగం మంది ప్రతీకారానికే నిశ్చయించారు. దుర్బుద్ధి తండ్రి నాయకత్వాన వారు ఆయుధాలు తీసుకుని బయలుదేరారు. వారు పిపీలకుడుండే చోటికి చేరుకునే సరికి రూపధరుడూ, అతని తండ్రీ, మిగిలినవారూ ఆయుధాలు తీసుకుని వారిని ఎదుర్కోవటానికి సిద్ధమైనారు. ధీరమతి తన తండ్రితో, "నాన్నా, ఇవాళ వీరందరికీ నా ప్రతాపం చూపిస్తాను చూడు!" అన్నాడు.

పిపీలకుడు పరమానందంతో, "ఈశ్వరా, ఇది నా జీవితంలో ఎంత పర్వదినం! నా కొడుకూ, మనవడూ ప్రతాపంలో పోటీ పడుతున్నారు!" అన్నాడు. ఆయనకు ఎక్కడ లేని ఉత్సాహమూ వచ్చింది. ఆయన తన ఈటెను ఎత్తి బలంగా దుర్బుద్ధి తండ్రిపైకి విసిరాడు; ఆయన ఆ దెబ్బకు పడిపోయాడు. రూపధరుడు మొదలైనవారు మిగిలినవారిపై పడ్డారు. కాని అంతలోనే వారికి బుద్ధిమతీదేవి వాక్కు వినిపించింది:

"ఇథకా పౌరులారా! ఈ రక్తపాతం ఇంతటితో ఆపండి!"

ఆ కంఠం వినగానే అందరూ తెల్లబోయారు. వారి చేతుల నుంచి ఆయుధాలు జారి కిందపడిపోయాయి. రూపధరుడిపైన పగ తీర్చుకోవచ్చినవారు వెనక్కు తిరిగి నగరానికి వెళ్ళిపోయారు.

తరవాత రూపధరుడికి శత్రుభయం లేకుండా పోయింది. అతను తన భార్యతోనూ, కుమారుడితోనూ, తండ్రితోనూ సుఖంగా జీవించాడు. – (అయిపోయింది)





# దేవుడిపై భారం

పూర్వం పర్షియాదేశంలోని ఒక గ్రామంలో ఫకీరు ఒకడుండేవాడు.వాడు వట్టి మూర్ఖుడూ, సోమరిపోతూనూ. కాళ్ళూ, చేతులూ ఉండి, కావలసినంత బలంఉన్నా కష్టంచేసి బతకాలన్న ఇచ్ఛ లేదు వాడికి.కడుపు నింపడం కోసం యాచన చేసేవాడు.

కొంత కాలానికి వాడికి ఊళ్ళో భిక్షంపెట్టే వాళ్ళే కరువయ్యారు. ఇక ఆ ఊళ్ళో ఉండడం సాధ్యపడదనిపించి, ఒకనాటి ఉదయం పక్క ఊరికి బయలుదేరాడు ఫకీరు.

మధ్యలో ఒక పెద్ద అడవి దాటవలసి వచ్చింది. ఫకీరు అడవి గుండా ప్రయాణం చేస్తూండగా, ఒకచోట కాళ్ళూ, చేతులూ లేని నక్క ఒకటి కనిపించింది. ఆశ్చర్యపోయాడు ఫకీరు: "ఆహా, భగవంతుని సృష్టి! కాళ్ళూ, చేతులూ లేకుండా ఈ నక్క ఈ భయంకరాటవిలో ఎలా జీవిస్తున్నట్టు? ఆహారం ఎలా సంపాదించుకుంటున్నది?"

ఫకీరు ఇలా అనుకుంటూండగా, పెద్దపులి ఒకటి జింకను చంపి అటుగా ఈడ్చుకుని వచ్చింది. పులిని చూడగానే ఫకీరు ఒక పొద చాటున నక్కి కూర్చున్నాడు.

పెద్దపులి తన ఆకలి తీరేవరకు జింకను కొంతవరకుతిని, మిగిలినదాన్ని అక్కడే వదిలేసి వెళ్ళిపోయింది. పులి తినగా మిగిలినజింక దేహాన్ని– కాళ్ళూ, చేతులూ లేని ఆ మొండి నక్క తిని ఆకలి తీర్చుకున్నది.

ఫకీరుకు ఒక గొప్ప సత్యం తెలిసి వచ్చినట్టు అనిపించింది. సకల జీవపోషకుడైన సర్వేశ్వరుడే ఆ మొండి నక్కకు అవసరమైన ఆహారాన్ని సకాలంలో దానికి అందజేస్తున్నాడు!

"భగవంతుడు ఆ మొండినక్కకు ప్రతి రోజూ దాని ఆహారం అందిస్తున్నట్టే, నాకు మాత్రం ఎందుకు అందించడు? ఏమైనా సరే ఇక మీదట నేను ఎవరినీ తిండి

యాచించబోను. భగవంతుణ్ణి నమ్ముకుంటాను. నక్కలాగే నేనూ ఒక మూల కూర్చుంటాను. నా దిన బత్తెం భగవంతుడే నా దగ్గరికి పంపిస్తాడు," అని నిశ్చయించుకుని, ఆ ఫకీరు గ్రామం వైపు ప్రయాణంసాగించాడు.

అతను ప్రక్కగ్రామం చేరి తిన్నగా మసీదు వద్దకు పోయి, జోలె కట్టి మసీదు ముందు నిలబడ్డాడు. అక్కడున్న ఒక పెద్దమనిషి ఫకీరును చూసి, "అయ్యా, ఇక్కడ ఎవరూలేరు. మరొకచోటికి పోయి యాచించు!" అని సలహా ఇచ్చాడు.

"ఇల్లంటూ ఉన్న తరవాత ఎవరూ ఉండకపోవడమేమిటి? ఇందులో ఉండేవారు దీనుల అవస్థకు జాలి చెందరా?" అన్నాడు ఫకీరు.

ఆ పెద్దమనిషి చిరాకు పడుతూ, "ఇక్కడ ఉండేది ఎవరనుకున్నావు? నీకూ, నాకూ ప్రాణం ఇచ్చినవాడూ, సకలజీవపోషకుడూ అయిన సర్వేశ్వరుడు. అతన్ని అపహాస్యం చెయ్యకు. దయవుంచి వెళ్ళిపో," అన్నాడు.

"సర్వేశ్వరుడి ఇంటి ముందు యాచించి వట్టిచేతులతో వెళ్ళిపోవటమేమిటి? ఏమైనా సరే నా భిక్షాన్ని తీసుకోకుండా ఇక్కడినుంచి పోను!" అంటూ ఫకీరు ఒక చెట్టు నీడన జోలె దింపి, "దీన పోషకా! నీఅదృశ్యభండారం నుంచి నా దినబత్తెం పంపించు!" అంటూ బైఠాయించాడు.

ఫకీరు ఆ ఊరికి కొత్త కావటం చేత అతన్ని గురించి పట్టించుకున్నవాడే లేకపోయాడు.

కొంతకాలానికి, తిండి లేక ఫకీరు శుష్కించాడు. అతని కండలన్నీ కరిగిపోయి, చర్మమూ ఎముకలూ మిగిలాయి. ఫకీరు అవసానదశను చేరుకుంటున్నాడు.

ఆ సమయంలో మసీదు అంతర్భాగం నుంచి ఈ మాటలు వినిపించాయి:

"మూర్ఖుడా! నీవు కాళ్ళూ, చేతులూ లేని మొండినక్కవా? శక్తి కలిగి ఎంగిలి మెతుకులకు ఆశపడటం నీచం. కాయకష్టంతో పరుల సౌఖ్యానికి పాటుపడేవారిని నేను అనుగ్రహిస్తాను."

ఈ మాటలు విని ఫకీరు సిగ్గు పడ్డాడు. అతనికి జ్ఞానోదయమయింది. కొసప్రాణంతో అతను మసీదు నుంచి బయటపడి, ఆనాటి నుంచి కాయకష్టం చేసి, నలుగురిలో పరువుగా బ్రతకసాగాడు.





# శివమల్లుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రివేళ హంసతూలికాతల్పంపై శయనించి, సుందర స్వప్నాలలో తేలియాడవలసిన నువ్వు, ఈ శ్మశానంలో కాటికాపరిలా ఊడిగం చేయడం చూస్తూంటే, విధిబలీయం అంటే ఇదేనేమో అనిపిస్తున్నది. సహజంగా, కాంతాకనకాల కోసమే ప్రతి పురుషుడూ ఆరాటపడతాడు. నీ ధోరణి చూస్తూంటే – ఏ స్త్రీహృదయాన్ని జయించడం కోసమో, ఇన్ని కష్టాలకు గురి కావడంలేదు కదా, అన్న శంక కలుగుతున్నది. అయితే, ఇంత ఓర్పుతో, పట్టుదలతో కార్యసాధనకు పూనుకున్న నువ్వు, ఆఖరిక్షణంలో శివమల్లుడిలా మనసు మార్చుకుని, వెర్రివాడిలా ప్రవర్తించి, శ్రమ ఫలితాన్ని మరొకరి

## బేతాళ కథలు




పాలు చేయగలవేమో అని అనుమానంగా ఉంది. నీకు హెచ్చరికగా ఉండేందుకు, అతడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ప్రణవపురాన్ని విజయసేనుడనే రాజు పాలించేవాడు. ఆయన సహృదయుడు, పరిపాలనాదక్షుడు. ప్రణవపురానికి పడమర దిశగా అరణ్య ప్రాంతంలో,ఒక గిరిజన గూడెం ఉండేది. యుద్ధసమయాల్లో ఆ గిరిజనులు విజయసేనుడికి సాయపడే వాళ్ళు.

ఆ గిరిజనగూడెం నాయకుడి పేరు శంభునాథుడు, అతడి కుమారుడు శివ మల్లుడు విలువిద్యలో మహానేర్పరి. అరణ్యంలో మెరుపు వేగంతో పరిగెత్తే జింకనైనా, పులినైనా ఒకే ఒక బాణం దెబ్బతో నేల కూల్చే వాడు.

ప్రణవపురానికి పొరుగునే వున్న కైవల్యపురి రాజు ధీరసేనుడు, విజయసేనుడికి సామంతరాజు. ఒకనాడు ధీరసేనుడి కుమార్తె యువరాణి అమృతవల్లి, తన చెలికత్తెలతో వనవిహారానికి బయలుదేరింది. ఆమె వున్న రథం గిరిజనగూడెం ప్రాంతాన వెళుతూండగా, ఒక అడవిమామిడి చెట్టు పైనుంచి, భయంకరమైన కొండచిలువ ఒకటి, యువరాణి పైకి దుమికి, మింగడానికి ప్రయత్నించ సాగింది.

యువరాణి ప్రాణభయంతో కంపించి పోతూ, పెద్దగా ఒక కేక పెట్టింది. రథసారథీ, చెలికత్తెలూ హడలిపోయి రథం మీదినుంచి కిందికి దూకి, రక్షించమంటూ కేకలు వెయ్యసాగారు.

ఆ సమయంలో, ఆ ప్రాంతానికి వేటకు వచ్చిన విజయసేనుడు, ఈ ఆర్తనాదాలు విని, గుర్రంమీద వేగంగా అటుకేసి వచ్చి, ఆ దృశ్యం చూసి నిర్విణ్ణుడయ్యాడు. అతడికీ, రథానికీ దాదాపు రెండువందల గజాల దూరం ఉన్నది. బాణం వేసి కొండచిలువను హతమారుద్దామంటే– గురి తప్పి బాణం ఆ సౌందర్యరాశికి తగలవచ్చు!

ఏమి చేయడమా అని విజయసేనుడు మథనపడుతున్నంతలో, కేకలు విని పరుగు పరుగున వస్తూనే, శివమల్లుడు అమ్ముల పొది నుంచి ఒక బాణం తీసి, కొండ చిలువ తలకు గురిచేసి వదిలాడు. బాణం ఝుంకారనాదం చేస్తూ పోయి, కొండచిలువ తలకు తగిలింది.ఆ మరుక్షణం కొండచిలువ మెలికలు తిరుగుతూ నేలమీద పడింది. అమృతవల్లి ప్రాణాపాయం నుంచి బయట పడింది.

తర్వాత, తనను సమీపించిన శివమల్లుణ్ణి కృతజ్ఞతాపూర్వకంగా చూస్తూ, ఆమె, "నేను కైవల్యపురి యువరాణి అమృతవల్లిని. నీ కారణంగా నేను ప్రాణాపాయం నుంచి రక్షించ బడ్డాను. ఎంతో కృతజ్ఞురాలిని. నీ సహాయానికి విలువ కట్టలేకపోయినా,నా తృప్తి కోసం ఈ రత్నహారం తీసుకో!" అంటూ తన మెడలోని హారాన్ని తీసి శివమల్లుడికి అందించింది.

హారం తీసుకుని, తనను కన్నార్పకుండా చూస్తున్నశివమల్లుడితో, యువరాణి, "వీలు చూసుకుని ఒకసారి రాజధానికి రా. నిన్ను నా అంగరక్షకుడుగా నియమించమని, నాన్నగారికి చెబుతాను. నీకు అభ్యంతరం లేకుంటేనే సుమా!" అన్నది మందహాసంతో.



ఈ దృశ్యం చూసిన విజయసేనుడి మనసు ఈర్ష్యతో భగ్గుమన్నది. రాజకుమారి కనీసం తన వైపు కూడా చూడకపోవడం, అతడికి మరింత బాధ కలిగించింది.

రాజధాని చేరిన విజయసేనుడికి, యువరాణి అమృతవల్లి రూపమే కనుల ముందు కదలసాగింది. ఆమెను వివాహమాడని జీవితం వ్యర్థమనిపించింది. యువరాణి, తన సామంతరాజు కుమార్తె. తను వివాహమాడతానంటే, తప్పక సమ్మతిస్తుందనుకున్నాడు. ఒకవేళ అందుకు అంగీకరించకపోతే, కారణం శివమల్లుడై ఉంటాడు!

ఇలా విజయసేనుడు ఊహాగానాల్లో మునిగి తేలుతూండగా, వేగులు- శివమల్లుడు యువరాణి అంగరక్షకుడుగా నియమించబడ్డాడన్న వార్త తెచ్చారు. ఇక ఆలస్యం చేస్తే, యువరాణి తనకు దక్కదన్న ఆలోచన కలిగింది విజయసేనుడికి.

అతడు, అమృతవల్లి తండ్రి ధీరసేనుడికి ఒక లేఖ రాస్తూ, అందులో అమృతవల్లిని తన కిచ్చి వివాహం చేయాలని కోరుతూ, ఒకవేళ అతడందుకు అంగీకరించడేమో నన్న అనుమానంతో- అలా కాని పక్షంలో కైవల్యపురిని జయించి అయినా, యువరాణిని చేపట్టక మాననని ఉదహరించి, లేఖను ఒక దూత ద్వారా ధీరసేనుడికి పంపాడు.

ఆ లేఖను చదివిన ధీరసేనుడు ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయి, దాన్ని తన కుమార్తెకు ఇస్తూ, "చూడమ్మా, మహారాజు నిన్ను వివాహమాడదలచాడు. నీ అదృష్టం పండింది!" అన్నాడు.

లేఖను చదివిన అమృతవల్లి ముఖం కోపంతో జేవురించింది. ఆమె కొద్దిసేపు మౌనంగా వుండి, తండ్రితో, "నాన్నా, ఈ



ఈ లేఖను ఒకటికి రెండుసార్లు చదివిన తర్వాత, విజయసేనుడికి ఆవేశం తగ్గి స్థిమితంగా ఆలోచించాడు. పరస్పరమైన ఆకర్షణా, ప్రేమానురాగాలతో కాక, తన సైనికబలంతో భయపెట్టి యువరాణిని వివాహమాడ దలచడం పెద్ద పొరబాటనీ, రాజోచితం కాదనీ అతడు గ్రహించాడు.

తన కుమార్తె రాసిన లేఖ చదివి, ఆగ్రహించి విజయసేనుడు తన రాజ్యం మీదికి దండెత్తి రాగలడని ధీరసేనుడు భయపడ్డాడు. కాని రెండు, మూడు నెలలు గడిచినా అలా జరగకపోయే సరికి, విజయసేనుడు మరొక యువతిని పరిణయమాడ దలచాడేమో అనుకున్నాడు ధీరసేనుడు.

అయితే, అమృతవల్లి అతడితో, "నా ఊహ నిజమయింది, నాన్నా! నా లేఖ చదివిన విజయసేనుడు, యుద్ధప్రయత్నాలను విరమించి, నన్ను మరింత గాఢంగా ప్రేమిస్తాడని ఊహించాను. అలాగే జరిగింది," అన్నది.

లేఖ ఒక రాజు తన సామంతుడికి చేసే హెచ్చరికలా ఉంది తప్ప, నాపై ఆయనకు నిజమైన అనురాగం ఉన్నట్టు కనిపించడం లేదు. ఇలాంటి అహంభావిని వివాహమాడి నేను సుఖపడలేను!" అని, తానే స్వయంగా జవాబు రాసి దూత ద్వారా విజయసేనుడికి పంపింది.

అమృతవల్లి లేఖ చదివిన విజయసేనుడు ఆగ్రహంతో ఊగిపోయాడు. లేఖలోని సారాంశం ఏమిటంటే– "ప్రస్తుతం నేను వివాహం చేసుకునే ఆలోచనలో లేను, మన్నించండి. నన్ను బలవంతంగా వివాహమాడాలనే ఆలోచనను విరమించండి. మీ పెద్ద సైన్యంతో, మా రాజ్యాన్ని జయించడం, మీకు చిటికెలో పని. అయితే, మా రాజ్యాన్ని గెలిచినంత మాత్రాన, నా హృదయాన్ని గెలిచినట్టు కాదు గదా? ఆలోచించి సరైన నిర్ణయం తీసుకోండి!"

కొంతకాలం గడిచాక, ఒకనాటి సాయంత్రపువేళ అమృతవల్లి ఉద్యానవనంలో తిరగ సాగింది. శివమల్లుడు ఉద్యానద్వారం వద్ద నిలబడి ఉన్నాడు. అమృతవల్లి అటూ ఇటూ తిరుగుతూ, ఒకచోట ఎండుటాకుల మధ్య పడుకుని ఉన్న సర్పం మీద కాలుమోపింది. వెంటనే సర్పం కసిగా ఆమె పాదం మీద కాటు వేసింది.

"అమ్మా!" అంటూ ఆర్తనాదం చేసి అమృతవల్లి కుప్పకూలిపోయింది. వెంటనే శివమల్లుడు మెరుపువేగంతో అక్కడికి వచ్చి, పక్కన వున్న పూపొదల్లోకి జరజరపాకిపోతున్న రక్తవర్ణ సర్పాన్ని కత్తితో రెండు తుండేలుగా నరికాడు.

వార్త విని రాజు, రాణి, చెలికత్తెలు అక్కడికి వచ్చారు. శివమల్లుడు అప్పటికే రాజవైద్యుణ్ణి వెంటబెట్టుకుని వచ్చాడు. రాజవైద్యుడు మరణించిన పామును చూసి, దిగ్భ్రాంతి చెందాడు. అయన అమృతవల్లి పాము కాటుకు గురైన పాదానికి ఏదో పసరు రాసి, ధీరసేనుడితో, "మహారాజా! యువరాణి గారికి కాసేపట్లో స్పృహ వస్తుంది. కానీ ఆమె విష ప్రభావం వల్ల శాశ్వతంగా అంధురాలవుతుంది.ఆమెను కాటు వేసింది మామూలు సర్పం కాదు. రక్తబీజమనే మహాసర్పం. ఇక్కడికి ఈశాన్య దిశలో, యాభై ఆమడల దూరాన గల రక్తపిపాసి కొండల్లో మాత్రమే, ఈ సర్పాలు నివసిస్తాయని విన్నాను. అటువంటి అరుదైన సర్పం మన ఉద్యానవనంలో ప్రత్యక్షం కావడం యువరాణి వారి దురదృష్టం!" అన్నాడు.

ఇంతలో స్పృహలోకొచ్చిన యువరాణి, కళ్ళు నులుముకుని చూసి, "శివమల్లా! నాకేమీ కనిపించడం లేదు. నేను అంధురాలినయిపోయాను!" అన్నది గద్గద స్వరంతో.

శివమల్లుడు ఏమని బదులివ్వాలో తెలియక దోషిలా తలదించుకున్నాడు.

రాణి, కుమార్తెను అక్కున చేర్చుకుని బావురుమన్నది. రాజు దుఃఖాన్ని దిగ మింగుకుంటూ, "వైద్యశేఖరా! యువరాణికి చూపు వచ్చే మార్గం లేదా?" అన్నాడు.

రాజవైద్యుడు గొంతు సవరించుకుని, "రక్తబీజ సర్పం కాటుకు గురైన వారికి, పోయిన దృష్టి రావాలంటే, ఒకే ఒక మార్గం ఆయుర్వేదగ్రంథంలో తెలుపబడింది. సర్పగంధి పుష్పాన్ని కళ్ళకు తాకించాలి," అన్నాడు.




"మరి ఎందుకింక ఆలస్యం? వెంటనే ఆ పనేదో చెయ్యండి," అన్నాడు రాజు ఎంతో ఆతృతగా.

రాజవైద్యుడు నిట్టూర్చి, "మహారాజా! ఇంతకుముందే విన్నవించాను. ఎవరైనా సాహసించి వెళ్ళి నేర్పుగా రక్తపిపాసి కొండల వద్ద గల ఒక కాళికాలయం దాపులనున్న సర్పగంధి వృక్షం నుంచి– దాని పుష్పాన్ని తీసుకురావాలి. బాల్యంలో మా తాతగారు చెప్పగా విన్నాను; ఆ వృక్షం యాభై సంవత్సరాలకు ఒక పుష్పం మాత్రమే పూస్తుందట. అది చికిత్సకు ఒకసారి మాత్రమే ఉపయోగిస్తుంది. దాదాపు నూరడుగుల ఎత్తు పెరిగే, ఆ మహావృక్షం చుట్టూ రక్తబీజ సర్పాలు సంచరిస్తూ ఉంటాయట. వాటి బారిన పడకుండా ఆ పుష్పాన్ని సంపాదించడం కష్టసాధ్యం!" అన్నాడు.




మరొక ఆలోచన లేకుండా సర్పగంధి పుష్పం కోసం బయలుదేరాడు.

శివమల్లుడు రాత్రి వేళల కొన్నిగంటలు మాత్రం, ఏ చెట్టు కిందో నిద్రపోతూ, వారం రోజులు ప్రయాణించి,చివరికి శిథిల కాళికాలయం పక్కన వున్న సర్పగంధి వృక్షాన్ని చేరుకున్నాడు.

ఆకాశాన్నంటేటట్లున్న ఆ వృక్షం చుట్టూ అసంఖ్యాకంగా రక్తబీజ సర్పాలు తిరుగుతున్నవి. వాటి బారిన పడకుండా వృక్షాన్ని సమీపించడం అసాధ్యమని శివమల్లుడు గ్రహించాడు. ఆకులు, కొమ్మలు అంతగా లేని, ఆ చెట్టు చిటారున ఆకాశంలో నక్షత్రంలా ఒకే ఒక సర్పగంధి పుష్పం అరుణ వర్ణంలో మెరిసిపోతూ కనిపించింది.

శివమల్లుడు పుష్పం కేసి కొద్దిసేపు కన్నార్పకుండా చూసి, తర్వాత వింటికి బాణం సంధించి పుష్పంకేసి వదిలాడు. బాణం పుష్పానికి గురిగా తగిలి, గాలిలో తేలుతూ వచ్చి కింద పడింది. వెంటనే విషసర్పాలు దానిచుట్టూ గుమిగూడాయి. ఇప్పుడు ఏమి చేయాలో పాలుపోని శివమల్లుడు, పుష్పం కేసి అయోమయంగా చూస్తూ అలాగే ఉండిపోయాడు.

ఇంతలో అతడికి దగ్గరలో గుర్రపుడెక్కల చప్పుడు వినిపించింది. కాసేపటికి గుర్రాన్ని అధిరోహించిన విజయసేనుడు అక్కడికి వచ్చాడు. అతడు గుర్రం దిగకుండానే సర్పాల మధ్య పడివున్న సర్పగంధి పుష్పాన్ని చూసి, "ఓహోఁ, నాకంటే ముందు వచ్చి పుష్పాన్ని కొట్టావన్న మాట!" అన్నాడు శివమల్లుడి వైపు తలతిప్పి అసూయగా.

రాజు కాసేపు ఆలోచించి, "సర్పగంధి పుష్పాన్ని సంపాదించి యువరాణికి తిరిగి చూపు తెప్పించిన మహావీరుడికి, ఆమెనిచ్చి వివాహం జరిపిస్తానని రాజ్యమంతా చాటింపు వేయించండి!" అని చెప్పాడు.

వెంటనే శిమల్లుడు, "మహారాజా! ఆ సర్పగంధి పుష్పాన్ని సాధించుకురావడానికి ప్రయత్నిస్తాను. నన్ను ఆశీర్వదించండి!" అన్నాడు.

"నీకు జయం కలుగుగాక!" అని రాజు అతణ్ణి ఆశీర్వదించాడు.

శివమల్లుడు అశ్వశాలలోని, ఒక ఉత్తమ జాతి అశ్వాన్ని అధిరోహించి, వాయువేగంతో రక్తపిపాసి కొండలకేసి బయలుదేరాడు.

ఈ సంగతి మర్నాటి ఉదయానికే ప్రణవపురి రాజైన విజయసేనుడికి వేగుల ద్వారా తెలిసింది. వెంటనే విజయసేనుడు

"మీరు ఇక్కడికి వస్తారని ఊహించాను, మహారాజా! పుష్పం కోసం వెళ్ళకండి, చాలా ప్రమాదం," అంటూ శివమల్లుడు మెరుపు వేగంతో పరిగెత్తి సర్పగంధి పుష్పాన్ని అంటుకున్నాడో లేదో, రక్తబీజ సర్పాలు వాడి చేతి మీద కాటు వేశాయి. శివమల్లుడు తూలుకుంటూ వచ్చి, పుష్పాన్ని విజయసేనుడి చేతిలో పెట్టి, "మహారాజా! తమరు యువరాణి వారికి చూపు తెప్పించి, వివాహమాడి సుఖంగా జీవించండి," అంటూ విషప్రభావం వల్ల స్పృహ కోల్పోయాడు. కొద్దిసేపటికి వాడికి స్పృహ వచ్చింది.కాని అంధుడై పోయాడు.

రాజు విజయసేనుడు, శివమల్లుణ్ణి కౌగలించుకుని, "శివమల్లా! నీ త్యాగం నిరుపమానం. నిన్ను అపార్థం చేసుకున్నందుకు మన్నించు. నా ఆస్థానంలో ఒక్క ఆయుర్వేదమే కాక, ఇతరత్రా వైద్యశాస్త్రాలు చదవిన నిపుణులెందరో ఉన్నారు. రక్తబీజ సర్పాల కాటుకు, ఈ ఒక్క సర్పగంధి పుష్పమే చికిత్స అనుకోను!" అంటూ శివమల్లుణ్ణి గుర్రం మీద ఎక్కించుకుని రాజధానికేసి బయలు దేరాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శివమల్లుడి ప్రవర్తన అసహజంగా, అయోమయంగా ఉన్నదనడంలో సందేహానికి తావులేదు కదా! అతడు కొలువులో చేరిందే ఏనాటికైనా అమృతవల్లిని పెళ్ళాడాలనే కోరికతోనే. అటువంటప్పుడు సర్పగంధి పుష్పాన్ని సాధించి, యువరాణిని పెళ్ళాడవలసింది పోయి, తాను అంధుడై సాధించిన పుష్పాన్ని విజయసేనుడి చేతిలో పెట్టడం మూర్ఖత్వం కాదా? విజయసేనుడు వచ్చిన దాకా శివమల్లుడు పుష్పాన్ని పాముల మధ్యనుంచి తీసుకురావడానికి ఎందుకు ప్రయత్నించలేదో అర్థం కాదు. విజయసేనుణ్ణి పుష్పం కోసం వెళ్ళవద్దని వారించడం,శివమల్లుడి సంకుచిత మనస్తత్వా



నికి నిదర్శనంలా కనబడుతున్నది. అటువంటి వాణ్ణి, విజయసేనుడు త్యాగధనుడిగా శ్లాఘించడం విడ్డూరం కాదా?

ఇక, విజయసేనుడి సంగతికొస్తే- అతడు తొలుత యువరాణిని బలవంతంగానైనా వివాహమాడదలచినా, ఆమె లేఖ చదివాక ఆ ప్రయత్నం మానడం వింతగా లేదా? దీన్ని బట్టి విజయసేనుడికి యువరాణిపై ప్రేమ నశించినట్టే కదా? మరి అదే నిజమైతే సర్ప గంధి పుష్పం కోసం అతడు ప్రయత్నించడం దేనికి? శివమల్లుడిపై ఈర్ష్యతో అనుకోవచ్చునా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శివమల్లుడు కొలువులో చేరింది, యువరాణిని పరిణయ మాడాలనే ఉద్దేశంతో అనుకోవడం అర్థరహితం. అలాగే అమృతవల్లి కూడా శివమల్లుణ్ణి ప్రేమించలేదు. కేవలం అతడి విలువిద్యా నైపుణ్యాన్ని మాత్రమే అభిమానించింది. ఆమె ఆత్మాభిమానం గల యువతి. అధికారదర్పం చూపి, తనను వివాహమాడాలనుకున్న విజయసేనుడి లేఖకు దీటుగా జవాబిచ్చి, అతడి కళ్ళు తెరిపించింది. అతడికి అమృతవల్లిపై గల ప్రేమ చెక్కుచెదరలేదనడానికి సాక్ష్యం- సర్ప గంధి పుష్పం కోసం బయలుదేరడమే!

శివమల్లుడు సర్పగంధి పుష్పాన్ని బాణంతో కొట్టిన తర్వాత, సర్పాల మధ్య పడిన పుష్పాన్ని పాము కాటు తినకుండా తీసుకురావడం అసాధ్యమని గ్రహించాడు. తాను పాము కాటుకు గురై అంధుడైపోతే, పుష్పాన్ని యువరాణికి చేర్చే దెవరు? ఈ గ్రహింపు ఉండడం వల్లనే, విజయసేనుడు కంట పడిందాకా పుష్పాన్ని తెచ్చే ప్రయత్నం చెయ్యలేదు. విజయసేనుడు విషసర్పాల దాడికి గురికాకూడదనే, అతణ్ణి పుష్పం కోసం వెళ్ళవద్దని వారించాడు. విధి నిర్వహణలో శివమల్లుడి వజ్రసంకల్పాన్నీ, త్యాగనిరతినీ అర్థం చేసుకున్న విజయసేనుడు ముందు అతణ్ణి అపార్థం చేసుకున్నందుకు పశ్చాత్తాపపడి, శివమల్లుణ్ణి శ్లాఘించడం సముచితమే!" అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: రాఘవరాజు పట్టాభిరామరాజు రచన]



సముద్రతీర ప్రయాణాలు - 14

# కన్యాకుమారి

రచన : మీరానాయర్ ◆ చిత్రాలు : గోపకుమార్




**అం**దమైన పగడాల దీవులయిన లక్షద్వీప్‌ను వదిలి మళ్ళీ ప్రధాన భూభాగానికి తిరిగి వచ్చామంటే పద్మనాభపురం అనే తీర పట్టణం చేరుకుంటాం.

పద్మనాభపురం ప్రస్తుతం తమిళనాడు రాష్ట్రంలో ఉన్నప్పటికీ, 16-18 శతాబ్దాల మధ్యకాలంలో ఇది తిరువాన్కూరు మహారాజుల రాజధానిగా ఉండేది.

పద్మనాభపురం కోట మధ్యలో పద్మనాభపురాజభవనం ఉన్నది.

ఈ శతాబ్దం పూర్వార్థం వరకు తిరువాన్కూరు మహారాజులు ఈ భవనంలోనే నివసించారు. పశ్చిమతీరంలోని అద్భుతమైన కొయ్య శిల్పాలకు చక్కని ఉదాహరణగా దీనిని చెబుతారు. సూర్యుడి ఎండ, వేడి లోపలికి చొరబడని కోణంలో భవనపు గోడలు నిర్మించబడి ఉన్నాయి. నేల అద్దంలా మెరుస్తూ ఉంటుంది. కొబ్బరి చిప్పలు-గుడ్డు తెల్లసొన మిశ్రమంతో ఈ నేలను గచ్చు చేశారు. రాజు శయన మందిరంలోని మంచం అరవైమూడు రకాల ఔషధ కలపలతో తయారు చేయబడింది. ఈ కలపలను పోర్చుగీసు వారు ఇచ్చినట్టు చెబుతారు. రాణిగారి పానుపు, దంతంతో పొదుగబడి ఉన్నది.

రాజభవనంలోని ఒక రాతిస్తంభం మీద రాతితో చేయబడిన ఒక పెద్ద బంతి ఉన్నది. సైన్యంలో చేరాలని వచ్చే వారి బలాన్ని పరీక్షించడానికి ఇది ఉపయోగపడేది. ఈ రాతి బంతిని చేతులతో లేవనెత్తిన వారిని మాత్రమే ఆ కాలంలో సైన్యంలో చేర్చుకునేవారట.

పద్మనాభపురానికి పదహారు కి.మీ. దక్షిణంగా



పద్మనాభపురం
రాజభవన ముఖద్వారం



కన్యాకుమారి దేవత

సుచీంద్ర ఆలయం ఉన్నది. ఒక ఆలయం లోపల పదమూడు ఆలయాలు ఉండడం ఇక్కడి విశేషం. ఇంద్రుడు తన పాపపరిహారం కోసం సుచీంద్రం ఆలయంలో కాగుతూన్న నెయ్యిలో తన చేయి ముంచాడట. కొన్ని దశాబ్దాల క్రితం వరకు ఇక్కడ ఒక వింత పద్ధతి ఆచరణలో ఉండేది. ఎవరి మీదనైనా నేరం చేశారనే అనుమానం ఉన్నట్టయితే అటువంటి వారిని, ఆలయ ప్రాంగణంలో మరుగుతూన్న నెయ్యి భాండంలో చేయి పెట్టమనేవారు. అటువంటి వ్యక్తి రోజంతా ఉపవాసం చేసి, సలసల కాగే నెయ్యి భాండంలో చేయి పెట్టాలి.ఆ తరవాత మూడు రోజుల వరకు ఆ వ్యక్తి చేతి మీద బొబ్బలు రాకుండా ఉంటేనే అతన్ని నిర్దోషిగా ప్రకటించేవారు.

41 మీ౹౹ ఎత్తయిన ఆలయ గోపురానికి అభిముఖంగా 2,500 సంవత్సరాల నాటి వృక్షం బోదె ఒకటి ఉన్నది. డొల్లగా ఉన్న ఆ బోదెలోపల త్రిమూర్తులయిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల రూపాలు లింగాకారాలలో ఉన్నాయి.

ఆలయ ప్రాంగణంలోనే బ్రహ్మాండమైన హనుమాన్ విగ్రహం ఉన్నది. విగ్రహం శిరస్సు మీద గంగాజలం- పన్నీరు కలిపి అభిషేకం చేస్తారు. ఆ అభిషేక జలాన్ని విగ్రహం పాదాల వద్ద సేకరించి భక్తులకు తీర్థంగా ఇస్తారు.

దేవాలయ ఉత్తర మంటపంలో ఒకే నల్లరాతితో చేయబడిన నాలుగు సంగీత స్తంభాలు ఉన్నాయి. స్తంభాలకు గొట్టాకారాలతో ఊచలు ఉన్నాయి. వీటిని తడితే సంగీతం వినిపిస్తుంది. అంతే కాదు. కొన్ని ఊచలు జల తరంగ నాదాలనూ, మరికొన్ని ఊచలు తంబుర నాదాన్నీ, ఇంకా కొన్ని ఊచలు మృదంగ ధ్వనులనూ, మిగిలినవి వీణానాదాన్నీ వినిపిస్తాయి!

మన దేశం దక్షిణాగ్రంలో – అరేబియా సముద్రం, బంగాళాఖాతం, హిందూమహా సముద్రం సంగమించే చోట సుప్రసిద్ధమైన కన్యాకుమారి ఆలయం ఉన్నది.



కన్యాకుమారికి సంబంధించిన ఒక వింత కథ ఈ ప్రాంతంలో ప్రచారంలో ఉన్నది. సుచీంద్ర నాధుడు కన్యాకుమారిని వివాహమాడాలనుకుని, ఆ విషయం దేవతలకు చెప్పాడట. అయితే, కన్యాకుమారి దేవతను పెళ్ళాడితే, ఆమె భక్తులను రక్షించే శక్తిని కోల్పోతుందో ఏమోనని దేవతలు భయపడ్డారు. అందువల్ల వాళ్ళు నారదుణ్ణి చూసి ఈ పెళ్ళిని ఎలాగైనా ఆపమని ప్రార్థించారు. సరేనని నారదుడు సుచీంద్రం వెళ్ళి, సుచీంద్రనాధుణ్ణి దర్శించి– తెల్లవారేసరికి వివాహం జరిగి పోవాలి. లేకుంటే శుభఘడియలు దాటిపోతాయి అని చెప్పాడు. సుచీంద్రనాధుడు పరివారంతో కన్యాకుమారికి బయలుదేరాడు. కాని, నారదుడు కోడిపుంజుగా మారి కూత వేశాడు. ఆ కోడి కూత విని అప్పుడే తెల్లవారిపోయింది, శుభ ఘడియలు దాటిపోయాయని– సుచీంద్రనాధుడు విచారంతో వెనుదిరిగి వెళ్ళాడట!

సుచీంద్రనాధుడు రాలేదన్న కోపంతో కన్యాకుమారి, పెళ్ళికని వండిన వంటలను తీరంలోకి విసిరి, తపస్సుకు ఉపక్రమించిందట. ఆమె విసిరిన వంటలు గవ్వలుగానూ, రంగురంగుల ఇసుకగానూ మారిపోయిందట!

కన్యాకుమారి తీరంలోని ఇసుక– ఎరుపు, నలుపు, తెలుపు, ఊదా, నీలం, లేతఎరుపురంగులలో ఉంటున్నది. ఈ ఇసుకలో అణుశక్తి జనకాలైన మోనొజైట్, యురేనియం వంటి విలువైన రసాయనిక పదార్థాలు ఉన్నాయి.

మహాత్మాగాంధీ అస్తికలు ఉంచిన చోట గాంధీమంటపం నిర్మించి ఉన్నారు. కన్యాకుమారిలోని ఆకర్షణీయమైన భవనాలలో గాంధీమంటపం ముఖ్యమైనది.

సముద్రజలాలలో నిమజ్జనం చేయడానికి ముందు, గాంధీజీ అస్తికలను ఉంచిన చోట–నిగనిగలాడే ఒక నల్లరాతిని అమర్చి ఉన్నారు. ఆ నల్లరాతికి నేరుగా మంటపం పైకప్పు మీద చిన్న రంధ్రం ఉన్నది. ప్రతి సంవత్సరం అక్టోబర్ 2వ తేదీ గాంధీజయంతి నాడు, సూర్యకిరణాలు ఈ రంధ్రం గుండా వెళ్ళి, నల్లరాతి మీద పడి వింత కాంతి పుంజాన్ని సృష్టిస్తుంది. అంద మైన ఈ దృశ్యాన్ని చూడడానికి ఆ రోజు ప్రజలు అధిక సంఖ్యలో వస్తారు.



కన్యాకుమారి శివుణ్ణి గూర్చి తపస్సు చేసిందని చెప్పబడే పెద్ద బండ తీరానికి అర కి.మీ దూరంలో ఉన్నది. నవభారత పునరుజ్జీవనానికి



గాంధీ మండపం

శంఖారావం చేసిన స్వామీ వివేకానంద 1892వ సం॥ డిసెంబర్ నెలలో ఈ బండ మీదే మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ ధ్యానంలో గడిపాడు.

1970వ సం॥లో వివేకానంద కేంద్రం ఇక్కడ వివేకానంద స్మారక శిల (రాక్ మెమోరియల్)ను ఆవిష్కరించింది.

వివేకానంద స్మారక శిలకు సమీపంలో మరొక పెద్ద బండ ఉన్నది. దీని మీద 3 మీ. ఎత్తయిన తిరువళ్ళువర్ విగ్రహం ప్రతిష్ఠించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. తిరువళ్ళువర్ 'తమిళవేదం'గా ప్రసిద్ధి గాంచిన 'తిరుక్కురళ్' గ్రంథకర్త.

ఆయుర్వేద ఔషధాలు తయారుచేయడానికి ఉపయోగపడే అరుదైన మూలికలు పుష్కలంగా లభించే 'మరుదమలై' కొండ కన్యాకుమారి సమీపంలోనే ఉన్నది.

ఈ కొండను గురించి కూడా ఒక కథ చెబుతారు: రామరావణ యుద్ధసమయంలో లక్ష్మణుడు మూర్ఛబోయాడు. లక్ష్మణుణ్ణి కాపాడడానికి, రాముడి ఆనతి ప్రకారం, సంజీవనీ మూలికను తీసుకు రావడానికి హనుమంతుడు హిమాలయ పర్వతాలకు వెళ్ళాడు. కాని అక్కడ అతడు సంజీవనీ మూలిక ఏదో గుర్తించలేక, సంజీవ పర్వతాన్నే పెకలించుకుని వచ్చాడు. అలా తీసుకు వచ్చేప్పుడు, సంజీవ పర్వతం నుంచి ఒక ముక్క కింద పడి అదే మరుదమలై అయిందట. హనుమంతుడు ప్రతిష్ఠించాడని చెప్పబడే ఒక శివలింగం కూడా ఇక్కడ ఉన్నది.





# వరప్రసాదులు

కామనగరువు అనే గ్రామంలో, కామశాస్త్రి అనే పురోహితుడుండేవాడు. ఆయనకు ఇద్దరు కుమార్తెలు. అయినా, పున్నామనరకం దాటించేందుకు, మగపిల్లవాడు లేడని బాధ పడుతూండేవాడు.

ఇలా వుండగా– కోదాడ అనే గ్రామం నుంచి,కామనగరువు గ్రామంలో ఎవరింట్లోనో పెళ్ళి చేయించడానికి వచ్చిన చిట్టిపంతులు అనే పురోహితుడు, కామశాస్త్రి ఇంట్లో బస చేశాడు. కామశాస్త్రి తనకు మగ సంతానం లేని సంగతి ఆయనకు చెప్పుకుని బాధ పడ్డాడు.

అప్పుడు చిట్టిపంతులు, "మా గ్రామంలో నాంచారమ్మ అనే గ్రామదేవత ఉన్నది. జాతర సమయంలో, గరగనెత్తిన పెట్టుకుని, గుడి ముందు ఏర్పాటు చేసిన అగ్నిగుండం తొక్కుతూ, మనసులో ఏ సంతానం కావాలని కోరుకున్నా కలుగుతారు. విశేషమేమిటంటే; జాతిభేదాలు లేకుండా నిజమైన భక్తితో, ముందు గుడి పూజారి అనుమతి మాత్రం పొందాలి.గోకులాష్టమి వెళ్ళిన దశమి నాడు, మా కోదాడ గ్రామంలో నాంచారమ్మ జాతర జరుగుతుంది. నేను కూడా ఇద్దరాడపిల్లలు పుట్టిన తరవాత, మగపిల్లవాడికోసం నిప్పుల గుండం తొక్కాను!" అన్నాడు.

చిట్టిపంతులు చెప్పింది విన్న కామశాస్త్రి, తను కూడా కోదాడ వెళ్ళి నిప్పులగుండం తొక్కి మగ సంతానం పొందాలనుకున్నాడు.

కొద్ది వారాల తర్వాత వచ్చిన గోకులాష్టమి నాడు కృష్ణుడికి పూజ చేసి, కామశాస్త్రి కోదాడ గ్రామానికి బయల్దేరాడు. ఆయన చీకటిపడే వేళకు, కోదాడ శివారు గ్రామమైన చిత్రాడ చేరుకున్నాడు.చిత్రాడ నుంచి కోదాడ ఇంకా మూడు క్రోసుల దూరం ఉంటుంది. ఆ సమయంలో ఆకాశం మేఘావృతమై ఉన్నది. అందుచేత కామశాస్త్రి చిత్రాడలోనే ఆగిపోదలచాడు.పురోహితుణ్ణని చెప్పుకోవడం

జె. ఉదయనాగశిరీష



చేత, గ్రామస్థులతన్ని గ్రామపురోహితుడింటికి తీసుకువెళ్ళి, ఆయనకు పరిచయం చేశారు.

చిత్రాడ గ్రామ పురోహితుడు, కామశాస్త్రిని సాదరంగా ఆహ్వానించాడు. కోదాడలో నాంచారమ్మ గుడి ముందు అగ్నిగుండం తొక్కేందుకు వెళుతున్నానని చెప్పిన కామశాస్త్రిని ఆయన ఆశ్చర్యంగా చూసి, "అయ్యో! వేద పండితులమైన మనం కూడా అజ్ఞానంలో పడిపోతున్నాం. ఇప్పటికే మీకు ఇద్దరాడ పిల్లలున్నారు. దైవం అనుకూలించి అగ్నిగుండం తొక్కితే, మీకు మగపిల్లవాడు పుడితే మంచిదే. ఒక వేళ ఆడపిల్ల పుడితే ముగ్గురికి పెళ్ళి పేరంటాలు చేసే ఆదాయం, మీరు పౌరోహిత్యం మీద సంపాదించగలరా?" అని అడిగాడు.

"నారు పోసినవాడు నీరు పొయ్యక మానడు. అన్నింటికీ భగవంతుడే ఉన్నాడు. చనిపోయిన తర్వాత పితృలోకంలో సుఖంగా జీవించేందుకు, ఇంత పిండం వేసే కొడుకు పుడితే అదే చాలు," అన్నాడు కామశాస్త్రి.

చిత్రాడ పురోహితుడు నవ్వి ఊరుకున్నాడు. ఇంతలో లోపల్నుంచి భోజనాలకు పిలుపు వచ్చింది. ఇద్దరూ పీటల మీద కూర్చున్నారు. చిత్రాడ పురోహితుడి కూతురు రమాదేవి వడ్డిస్తున్నది. పరుషం పట్టి కామశాస్త్రి, పురోహితుణ్ణి మీకెందరు పిల్లలు అని అడిగాడు.

రమాదేవి కల్పించుకుని, "అయ్యా, మా నాన్నకు నేనొక్కర్తెనే కూతుర్ని. నాకొక అన్న ఉండేవాడు. పున్నామనరకం దాటిస్తాడని నిప్పుల గుండం తొక్కి, మా నాన్న మా అన్నను కన్నాడు. కాని, ఇరవైఏళ్ళ వయసులోనే మా అన్నకు నూరేళ్ళూ నిండిపోయాయి. మా అన్న పోయాడన్న బెంగతో, మా అమ్మ కూడా కాలం చేసింది. పౌరోహిత్యం తప్ప, మా నాన్నకు ఇంకే ఆధారమూ లేదు. ఒక కుర్రవాణ్ణి చేరదీసి, తను చేసే పౌరోహిత్యం పనులలో, తనూ బాధ్యత తీసుకుని నన్నిచ్చి పెళ్ళి చేశాడు. మా వారు పక్క గ్రామంలో పెళ్ళి చేయించడానికి వెళ్ళారు. పున్నామ నరకం దాటించడానికి, మా నాన్నకిప్పుడు అల్లుడే కొడుకు!" అన్నది.

ఈ మాటలు కామశాస్త్రికెంతో జాలి కలిగించాయి. ఆయన తనకు భోజనం పెట్టి ఆదరించిన వారికి సంతోషం కలిగేలా మాట్లాడాలనుకున్నాడు. ఆయన రమాదేవితో, "అమ్మా! మౌనంగా భోజనం చేయాలని శాస్త్రం చెబుతున్నది. అయినా, ఈ సమయంలో రెండు మాటలు మాట్లాడతాను. ఆడపిల్లయినా, మగపిల్లవాడైనా, సృష్టిలో సమాన

మైన తెలివి గలవారే. అంతెందుకు, మేము పూజించే గాయత్రి స్త్రీ. చదివే చదువులకు మూలరూపమైన సరస్వతి స్త్రీ అనే మాట మేము మర్చిపోలేదు. సంపద దేవత కూడా స్త్రీయే. ఏదో తరతరాల నమ్మకాన్ని బట్టి, మగపిల్లవాడంటూ పాకులాడతాం. ఆడపిల్ల లనయినా మగపిల్లలతో సమానంగా చదివించుకోవచ్చు. ఈసారి గనక నాకు అగ్నిగుండం తొక్కినా ఆడపిల్లే పుడితే, దాన్ని మగరాయుడు లాగే పెంచి, ఆడపిల్లలు మగవాళ్ళకు తీసిపోరని నిరూపిస్తాను. పరబ్రహ్మ స్వరూపమైన ఈ అన్నం పట్టుకుని ప్రమాణం చేస్తున్నాను!" అన్నాడు.

"మీకు మగపిల్లవాడు తప్పకుండా పుడతాడు. ఆడపిల్ల కొడుకులతో సమానమై, మగపిల్లలు లేని లోటు తీర్చగలదని, లోకం విశ్వసించగలిగే రోజు రావాలని, నేను కోరుకుంటున్నాను– అంతే," అన్నది రమాదేవి.

మరునాడు తెల్లవారగానే, కామశాస్త్రి కోదాడ వెళ్ళి, చిట్టిపంతులు సహకారంతో నాంచారమ్మ గుడి పూజారిని కలుసుకుని, నిప్పుల గుండం తొక్కి తన గ్రామానికి తిరిగి వచ్చాడు.

ఆడపిల్ల పుడితే మగపిల్లవాడితో సమానంగా పెంచుతానని, అన్నం పట్టుకుని ప్రమాణం చేసిన కారణమో, లేక కాకతాళీయమో తెలియదు. కామశాస్త్రికి నిప్పుల గుండం తొక్కిన ఏడాదిలోపులో, మగపిల్లవాడితో బాటు ఒక ఆడపిల్ల కూడా పుట్టి- కవల సోదరసోదరీలుగా గ్రామంలో ప్రచారమయ్యారు. మరొక వింత సంగతేమంటే - ఆ అన్నాచెల్లెళ్ళు రూపులోనే కాదు, అలవాట్లలో కూడా ఒకే విధంగా వుండి, అందరినీ ఆశ్చర్యపరిచేవారు.



కామశాస్త్రి చిత్రాడలో భోజనాల దగ్గర తానన్న మాట గుర్తుకు తెచ్చుకుని, "నాంచారమ్మ తల్లీ! పుత్రుడితో బాటు పుత్రికను కూడా ప్రసాదించావు. వరపుత్రుడిని పెంచినట్లే, వరపుత్రికను కూడా మగపిల్లవాడిలా పెంచుతాను!" అని, వాళ్ళకు శివ, రమ అని పేర్లు పెట్టాడు.

ఎందరుకాదన్నా కామశాస్త్రి శివ, రమలను సమానంగా చదివించాడు. శివ, రమలు ఒకరినిమించి ఒకరు పోటీ పడి శాస్త్రపండితులయ్యారు. వాళ్ళు పుట్టిన వేళావిశేషమేమిటో గాని, కామశాస్త్రికి సిరిఎత్తుకుంది. జమీందారు ఆస్థానపురోహితుడి కొడుక్కు తన కుమార్తెలలో ఒకామెనిచ్చి వివాహం చేయడంతో, ఆయన స్థితిగతులు పూర్తిగా మారిపోయాయి. రెండవకుమార్తెకు కూడా సులభంగా పెళ్ళి

చేశాడు. ఇప్పుడు శివ, రమ యుక్తవయస్సులో వున్నారు. వాళ్ళిద్దరికి కూడా మంచి సంబంధాలు చెయ్యాలనుకుంటున్నాడు కామశాస్త్రి.

అయితే శివ, రమలు తమపాండిత్యంతో నలుగుర్నీ ఆకట్టుకుంటూ కవలజంటకవులుగా ప్రచారమవ్వసాగారు. ఆశువుగా పద్యాలు చెప్పి, వాళ్ళు జమీందారు మెప్పు పొందిన కవులను కూడా ఆశ్చర్యపరచసాగారు.

వాళ్ళను గురించి అందరూ చెప్పుకోవడం విని, జమీందారు వాళ్ళను తన ఆస్థానానికి పిలిపించాడు. వాళ్ళు ఆశువుగా పద్యాలు చెప్పి, చమత్కారంగా మాట్లాడి, అందరి చేతా ఓహో అనిపించుకున్నారు. అయితే, జమీందారు ఆస్థానంలో ఉన్న ఒక సంస్కృతకవి, జమీందారుతో, "ప్రభూ! వీళ్ళు నిజంగా పండితులే అయితే, మీరు తప్పక ఆదరించవచ్చు. వీళ్ళ సంస్కృత పాండిత్యం ఏ పాటిదో పరీక్షించే అవకాశం, నాకివ్వండి. మార, నర, పూర, జార, పర, హార అనే పదాలతో పద్యం చెప్పమనండి. అంతేకాని, దుస్సంగాత్ మహతాం కిం భవతి – అంటే చెడ్డవారితో కలియడం వలన, మా వంటి మహాకవులకు మేలేం కలుగుతుంది!" అంటూ గర్వంగా మాట్లాడాడు.

వెంటనే రమ, శివ, "అయ్యా! మేం మీతో సరితూగలేం. వరప్రసాదులమైన మేము, స్త్రీ పురుషులిద్దరూ సమానశక్తివంతులే, అని చాటి చెప్పడానికి కవిత్వం చెబుతున్నాము తప్ప, ఎవరితోనూ పోటీపడ దలచలేదు. మీకు నమస్కారం చేసి మేం చెప్పే సమాధానం, 'మాన పూజాపహార' అని మాత్రమే!" అన్నారు.

సంస్కృత కవి సిగ్గుతో తలదించుకుని, జమీందారుతో, "మాన అంటే గౌరవము, పూజ అంటే సత్కారము, అపహార అంటే తపము అని అర్థము. చెడ్డ వారితో కలియడం వలన, మహాకవులకు గౌరవము, పూజ, సత్కారము లోపిస్తాయని నేనడిగిన మార, నర, పూర, జార, పర, హార పదాలలోని మొదటి అక్షరాలతో, మాన పూజాపహార, అని సంస్కృతంలో సమాధానం చెప్పి, గౌరవం, పూజ, సత్కారం మనలో ఎవరికి కలగాలో ఆలోచించుకోండి – అని అన్న ఈ చిన్నారులు నిజంగా మహాకవులే!" అని అభినందించాడు.

జమీందారు పరమానందం చెంది శివ, రమలను ఘనంగా సత్కరించి, ఆస్థానంలో స్థానమిచ్చి గౌరవించాడు.



# బంగారు
# ?డియలు
# 8





① ఇది రాజస్థాన్‌లోని చాలా అద్భుతమైన జైన ఆలయాలలో ఒకటి. ఇది 1439వ సం॥లో నిర్మించబడింది. ఇందులో 1444 స్తంభాల ఆధారంగా 29 మంటపాలు ఉన్నాయి. అయితే, ఇన్ని స్తంభాలలో ఏ రెండు స్తంభాలు కూడా ఒకదాని లాగా మరొకటి లేదు.

ఈ ఆలయం పేరూ, ఇది ఎక్కడ నిర్మించబడిందో చెప్ప గలరా?



②
ఈ పవిత్రమైన శివాలయం సముద్ర మట్టానికి దాదాపు 13,000 అడు గుల ఎత్తులో మంచుకొండల మధ్య ఉన్నది. ఇక్కడి శివలింగం మంచు తోనే ఏర్పడింది. ఈ శివలింగం చంద్రుడు పెరిగే శుక్లపక్షంలో పెరుగుతుంది, చంద్రుడు క్షీణించే కృష్ణపక్షంలో తరుగుతుంది.
ఈ ఆలయం ఎక్కడ ఉందో తెలుసా?



③
ఎడమవైపున ఉన్న లిపిని సింధు నాగరికత నాటి ప్రజలు ఉపయోగించారు. ఈ లిపికి అర్థం ఏమిటో ఇంతవరకు తెలియలేదు. కుడివైపున ఉన్న లిపికీ, సింధు నాగరికతనాటి లిపికీ చాలా దగ్గరి పోలికలు ఉన్నాయి. ఈ లిపిని ఎవరు ఉపయోగించారు?



# డిజైన్ను స్టెన్సిల్ చేయండి!




కాగితం, బట్ట, టీషర్ట్, కుషన్ కవర్లు మొదలైన వాటిమీద మీకు ఇష్టమైన డిజైన్ను స్టెన్సిల్ చేయడం నేర్చుకోవచ్చు. ఇది చాలా సులభం!



1. మందమైన కాగితం, లేదా ప్లాస్టిక్ షీట్ తీసుకోండి. దానిమీద మీకు కావలసిన డిజైన్ను లేదా ఆకారాన్ని ట్రేస్ చేసుకోండి. వీటికి సరళమైన, పెద్దడిజైన్లు తీసుకోవడం మంచిది.

2. తరవాత ఆ డిజైన్లను జాగ్రత్తగా కత్తిరించుకోండి. ఇప్పుడు మీ స్టెన్సిల్ సిద్ధం.

3. రంగుల మిశ్రమాన్ని చిక్కగా కలుపుకోండి. కత్తిరించిన డిజైన్ను తెల్లటి లేదా కలర్ డ్రాయింగ్ పేపర్ మీద ఉంచండి. దానిని కదలకుండా ఉంచి, దానిమీద రంగువేయండి. దీనికి దృఢమైన బ్రష్ను, లేదా కాటన్ ఊల్ను ఉపయోగించవచ్చు.





4. డిజైన్ను తీసి దాని పక్కనే ఉంచి, ఒక పద్ధతి ప్రకారం నిర్దిష్ట ఆకారం వచ్చేవిధంగా మొదట చేసినవిధంగా మళ్ళీ మళ్ళీ పెయింట్ చేసుకోవాలి.

5. బట్టల మీద, జెర్సీ వస్తువుల మీద స్టెన్సిల్ చేయడానికి బట్టల కుపయోగించే ఫ్యాబ్రిక్ పెయింట్ ఉపయోగించాలి. బట్టను చదునుగా ఉంచుకోవడం చాలా ముఖ్యం. అందువల్ల దీనిని ఒక కార్డ్బోర్డ్ మీద పిన్ చేసుకోవడం మంచిది.

## బొమ్మను పెద్దది చేయండి

చిన్న బొమ్మను పెద్దది చేయాలనుకుంటున్నారా? ఎలా చేయాలనే పద్ధతి ఇక్కడ చూడండి.



1. రూళ్ళకర్ర, పెన్సిల్ తీసుకోండి. మీరు పెద్దది చేయాలనుకునే బొమ్మ మీద 1 సెం.మీ కొలతతో గళ్ళు గీసుకోండి.
2. ఒక డ్రాయింగ్‌పేపర్ మీద 2 సెం.మీ కొలతతో పైన ఉన్నన్ని పెద్ద గళ్ళు గీసుకోండి.
3. ఇప్పుడు పైన ఉన్న చిత్రం చూసి, జాగ్రత్తగా గళ్ళలోని గీతలు కలపండి. రెండింతల చిత్రం తయారవుతుంది.



## పెంగ్విన్ కట్‌అవుట్ చేద్దాం

1. గట్టిగా ఉన్న అట్టమీద పెంగ్విన్ బొమ్మ గీసుకోండి. లేదా పైన చెప్పిన పద్ధతి ప్రకారం, పక్కన ఉన్న పెంగ్విన్ బొమ్మను పెద్దది చేసుకోండి.
2. బొమ్మను కత్తిరించుకోండి. ఎర్రగీతల మీదుగా కత్తిరించండి.
3. చుక్కల గీతల మీదుగా మడుచుకోండి. కంఠం దగ్గర లోపలికి మడవండి. రెక్కలను మడవండి. కాళ్ళను వెలుపలికి తీయండి. ఇప్పుడు మీరు కావాలనుకున్న పెంగ్విన్ కట్ అవుట్ సిద్ధం.



# మూడు సులభమైన అంచెలలో ఒంటె బొమ్మ గీయండి...



## బంగారు గడియలు నెం. 7

## సమాధానాలు



1. గోల్‌గుంబజ్. ఇది బిజాపూర్‌ను పరిపాలించిన అదిల్ షాహీవంశానికి చెందిన ఏడవ సుల్తాన్ మహమ్మద్ అదిల్ షా సమాధి. ఇది ప్రపంచంలోకెల్లా రెండవ అతి పెద్ద సమాధి.

2. జాటీంగా, అస్సాం.

3. ఇది బహాయీ మతస్థుల ప్రార్థనా మందిరం. 19వ శతాబ్దానికి చెందిన పర్షియన్ ప్రవక్త బహాఉల్లా ఈ మతాన్ని స్థాపించాడు.



4. డైనోజార్, ఏనుగుగా మారిపోయింది.



కలగాపులగమైన బొమ్మలు:
సరైన క్రమం: 1, 8, 4, 5, 6, 2, 10, 7, 9, 3.




హనుమంతుడు అరటితోట మధ్య పడుకుని ఉన్నాడు. ఎర్రని ముఖమూ, పచ్చని కళ్ళూ, బంగారం లాటి శరీరమూ, పెద్ద మూపులూ కలిగి, దారికి అడ్డంగా పడుకుని ఉన్న హనుమంతుణ్ణి చూసి భీముడు ఏమాత్రమూ భయపడక, దగ్గరికి వచ్చి సింహనాదం చేశాడు.

హనుమంతుడు కళ్ళు తెరిచి భీముణ్ణి చూసి చిన్నగా నవ్వుతూ, "నాయనా, ముసలి వాణ్ణి. జబ్బువాణ్ణి. అలిసిపోయి సుఖంగా నిద్ర పోతూంటే ఎందుకు లేపావు? నా వంటి జంతువుల మీద నీ వంటి జ్ఞానిభూత దయ చూపవచ్చునే! నీకు పెద్ద వాళ్ళను ఆదరించటం కూడా తెలియదు లాగున్నది. అసలుఇటుగా ఒంటరిగా ఎందుకు వచ్చావు? ముందున్న ప్రదేశం దేవతలు సంచరించేది. అక్కడికి మనుషులు పోరాదు. నా మాట విని తిరిగి వెళ్ళు," అన్నాడు.

"నేను క్షత్రియుణ్ణి. కురువంశాన పుట్టిన వాణ్ణి, నా పేరు భీమసేనుడు. నువ్వు ఎవరివి? ఇక్కడ ఎందుకున్నావు? నీకీ కోతి రూపం ఎలా వచ్చింది? నాకు దారి ఇయ్యి," అన్నాడు భీముడు.

"నేను వానరుణ్ణి, దారి తొలగను. అఘాయిత్యం చెయ్యక, మర్యాదగా తిరిగి వెళ్ళిపో," అన్నాడు హనుమంతుడు.

"దారి తొలగకపోతే అఘాయిత్యం చెయ్యటం కాదు, నీకు అపాయమే చేస్తాను," అన్నాడు భీముడు.

"అన్నా, నేను చాలా ముసలివాణ్ణి. జబ్బు మనిషిని. కదలలేను. నీకు నిజంగా వెళ్ళాలనే ఉంటే నన్ను దాటిపో," అన్నాడు హనుమంతుడు.

"దాటి వెళ్ళటం చాలా తప్పని నాకు తెలుసు. లేకపోతే, హనుమంతుడు సముద్రాన్ని దాటినట్టు ఎప్పుడో దాటక పోయానా?"

31. సౌంగధిక పుష్పాపహరణం



అన్నాడు భీముడు. "ఎవడా హనుమంతుడు? వాడు సముద్రాన్ని ఎందుకు దాటవలసి వచ్చింది?'" అని హనుమంతుడు అడిగాడు.

"నా లాగే హనుమంతుడు కూడా వాయు దేవుడి కొడుకు. నాకు అన్న అన్నమాట. చాలా గొప్పవాడు. రాముడి భార్యను లంకాధిపతి ఎత్తుకుపోతే, హనుమంతుడు ఆమెను వెతుకుతూ సముద్రం దాటి లంకకు వెళ్ళాడు. నేను కూడా ఆ హనుమంతుడికి తీసిపోని బలపరాక్రమాలూ, శక్తి సామర్థ్యాలూ కలవాణ్ణి. మంచిగా నాకు దారి ఇయ్యి. లేదా దెబ్బతింటావు," అన్నాడు భీముడు.

హనుమంతుడు భీముడి గర్వం తెలుసుకుని, నవ్వు ఆపుకుంటూ, "నాయనా, నన్నెందుకు బాధిస్తావు? నాతోకను పక్కకు నెట్టి నీ దారిన నువ్వు వెళ్ళు," అన్నాడు.

భీముడు నిర్లక్ష్యంగా ఎడమచేత్తో హనుమంతుడి తోక పట్టి ఎత్తబోయాడు. కాని అది కదలలేదు. అమితాశ్చర్యంతో అతను హనుమంతుడి తోకను రెండు చేతులాపట్టి, తన కున్న బలమంతా ఉపయోగించి కూడా ఆ తోకను కదల్చలేక పోయాడు.

భీముడికి చచ్చే సిగ్గు వేసింది. అతను చేతులు రెండూ జోడించి, "బాబూ, నా ప్రగల్భాలు మన్నించు. నువ్వు ఏ సిద్ధుడివో, గంధర్వుడివో గాని, మామూలు వానరుడివి మటుకు కావు. అభ్యంతరం లేకపోతే నీ కథ ఏమిటో చెప్పు. నన్ను నీ శిష్యుడుగా భావించుకో!" అన్నాడు.

దానికి హనుమంతుడు, "బాబూ, నేనే హనుమంతుణ్ణి. వాలి సుగ్రీవులకు వైరం వచ్చినప్పుడు సుగ్రీవుడు నా సహాయం కోరి, నాతో స్నేహం చేశాడు" అంటూ రామాయణ కాలం నాటి తన కథ అంతా వినిపించాడు. చివరకు హనుమంతుడు, "నేను ఇక్కడే ఉంటున్నాను. ఇక్కడ గంధర్వులూ, విద్యాధరులూ కూడా రోజూ రామ కథను పాటలు కట్టి పాడుతూ ఉంటే విని సంతోషిస్తూ ఉంటాను. ఈ ప్రదేశం మనుష్యులు రాదగినది కాదు. ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని భీముణ్ణి అడిగాడు.

భీముడు హనుమంతుడికి సాష్టాంగపడి, "మహాత్మా, ఇవాళ నీ దర్శనం చేయటంవల్ల నా జన్మ సార్థకమయింది. సముద్రం దాటిన నాడు నీ రూపం ఎలా ఉన్నదీ చూపి నన్ను ధన్యుణ్ణి చెయ్యి," అన్నాడు.

"ఆ నాటి రూపం ఈనాడు చూపటం నాకు సాధ్యమా, నాయనా? కాలంతోపాటు

సమస్తమూ మారటం లేదా?" అన్నాడు హనుమంతుడు.

అయినా, భీముడు వదిలిపెట్టలేదు. అప్పుడు హనుమంతుడు తన శరీరాన్ని భయంకరంగా పెంచాడు. ఆ శరీరం అరటి తోటంతా ఆక్రమించుకుని, ఆకాశం తాకు తున్నట్టుగా ఉండి, సూర్యుడి లాగా ప్రకాశిస్తున్నది. కళ్ళు నిప్పుకణాల లాగా ఉన్నాయి. కోరలు దీర్ఘంగానూ, క్రూరంగానూ ఉన్నాయి. కనుబొమలు దట్టంగా ముడిపడి ఉన్నాయి. తోక బ్రహ్మాండంగా పెరిగి, నేలను కొట్టు తున్నది.

హనుమంతుడు భీముడితో, "నా రూపం చూశావా, నాయనా? అవసరమైనప్పుడు నా శరీరాన్ని ఇంకా పెంచగలను. శత్రువుల ఎదట ఇంకా భయంకరంగా ఉంటాను. నువ్వు ఆ రూపాన్ని చూడలేవు," అన్నాడు.

భీముడు, "మహాత్మా, దీన్నే చూడ లేకుండా ఉన్నాను. కళ్ళు చీకట్లు కమ్ము తున్నాయి. ఈ రూపాన్ని ఉపసంహరించు," అని బతిమాలుకున్నాడు.

హనుమంతుడు తన మామూలు రూపం ధరించి, భీముణ్ణి కౌగిలించుకుని, "నాయనా, ఇది సౌగంధిక వనానికి దారి. వెళ్లిరా. నీకు శుభం కలుగు గాక. నీకు కష్టం కలిగి నప్పుడు నన్ను తలుచుకో. సాహసించి సౌగంధిక పుష్పాలు కోసేవు! దేవతలతో తగాదా వస్తుంది," అని చెప్పి అంతర్థాన మయ్యాడు.

రెట్టించిన ఉత్సాహంతో భీముడు ముందుకు సాగి, కొండల మధ్యగా ప్రవ హించే ఒక నదీతీరాన సౌగంధిక వనాన్ని



చూశాడు. వైడూర్యాలను పోలిన నాళాలు గల రకరకాల సౌగంధిక పుష్పాలు సువాసనలు వెదజల్లుతూ ఎంతో అందంగా ఉన్నాయి. ద్రౌపది కోరిక తీర్చటానికి భీముడు ఆ పువ్వులను కోయ బోతూండగా భయంకరాకారులైన రాక్షసుల వంటి కాపలావాళ్లు ఆయుధాలు ధరించి, భీముడి వద్దకు వచ్చి, "అయ్యా, నీ వెవరివి? ఆయుధాలు ధరించి ఇక్కడి కెందుకు వచ్చావు?" అని అడిగారు.

"నేను కురువంశంవాణ్ణి. పాండురాజు కొడుకును, ధర్మరాజు తమ్ముణ్ణి, ఈ సౌంగధిక పుష్పాల కోసం వచ్చాను," అన్నాడు భీముడు.

"ఇది కుబేరుడివనం. ఇక్కడికి మనుషులు రారాదు. కుబేరుడి అనుమతిపొంది కావలసినన్ని పూలు కోసుకుపో," అన్నారు రాక్షసులు.



"కుబేరుడు ఎక్కడ ఉన్నాడో! కాక పోయినా, నాలుగు పూల కోసం నే నతన్ని బిచ్చ మడగాలా? నేను క్షత్రియుణ్ణి. కోరినది బలంతో సాధించటం నా ధర్మం. ఇదేమీ కుబేరుడి పెరడు కాదు. ఇది దేవుడు సృష్టించిన చోటు. ఇక్కడ ఒకరిని మరొకరు యాచించేదేమిటి?" అని భీముడు, రాక్షసులు వద్దంటున్నా వినకుండా, సౌగంధిక పుష్పా లున్న కొలనులోకి దిగాడు.

అది చూసి రాక్షసులు భీముడి మీద కలియబడ్డారు. భీముడు తన గద గిరగిరా తిప్పి కొందరు రాక్షసులను చావగొట్టాడు. వారిలో కొందరు వెళ్ళి కుబేరుడితో ఇలా జరిగిందని చెప్పారు.

"భీముణ్ణి పూలు కోసుకోనివ్వండి. నాకేమీ అభ్యంతరం లేదు. మీరు అతనికి అడ్డు వెళ్ళకండి," అని వాళ్ళతో అన్నాడు కుబేరుడు. ఆ రాక్షసులు తిరిగి వచ్చి చూసేసరికి భీముడు బోలెడన్ని సౌగంధిక పుష్పాలను కోస్తూ కనిపించాడు.

ఈ లోపల ధర్మరాజు, తాము ఉన్న చోట భీముడు కనిపించక పోయేసరికి, "భీముడు ఎక్కడికి వెళ్ళాడు? నువ్వు ఎక్కడి కైనా పంపావా ఏమిటి?" అని ద్రౌపదిని అడిగాడు.

భీముడు సౌగంధిక పుష్పాలు తెస్తానని ఈశాన్యంగా బయలుదేరి వెళ్ళినట్టు ద్రౌపది చెప్పింది. అప్పుడు ఘటోత్కచుడు తన పరివారంతో వచ్చి, పాండవులను భీముడున్న చోటికి చేర్చాడు. భీముడు ద్రౌపదికి సౌగంధిక పుష్పాలు ఇచ్చాడు. పాండవులు కుబేరుడి అనుమతి పొంది, అర్జునుడి కోసం ఎదురు చూస్తూ గంధమాదన పర్వతం మీద ఉండి పోయారు. వారందరినీ తిరిగి నరనారాయణా శ్రమం వద్ద చేర్చి ఘటోత్కచుడు తన పరి వారంతో సహా సెలవు పుచ్చుకున్నాడు.

ఇలా ఉండగా ఒకనాడు జటాసురుడనే రాక్షసుడు ద్రౌపదిని ఎత్తుకుపోవాలనే దుర్బు ద్ధితో, బ్రాహ్మణ వేషం వేసుకుని, ధర్మరాజు వద్దకు వచ్చి, తాను పరశురాముడి శిష్యుడి ననీ, సమస్తశాస్త్రాలూ, అస్త్ర విద్యలూ నేర్చిన వాడిననీ చెప్పాడు. ధర్మరాజు ఆ మాటలు నమ్మి ఆ రాక్షసుణ్ణి తన వెంటఉండనిచ్చాడు.

ఒకనాడు భీముడు వేటకు వెళ్ళాడు. రోమశుడూ, ధౌమ్యుడూ, ఇతర మునులూ కాలకృత్యాలు తీర్చుకోవటానికి ఆశ్రమానికి దూరంగా వెళ్ళారు. ఆ సమయంలో జటా సురుడు పాండవుల ఆయుధాలన్నీ కాజేసి,



ముగ్గురు పాండవులనూ, ద్రౌపదినీ ఎత్తు కుని పారిపోసాగాడు. సహదేవుడు మాత్రం ఎలాగో వాడి భుజం మీది నుంచి జారి, వాడు కాజేసిన ఆయుధాలలో కత్తి ఒకటి లాగేసుకుని, భీముడి పేరుపెట్టి గట్టిగా అరుస్తూ రాక్షసుడి వెంటపడ్డాడు.

ధర్మరాజు వాడితో, "ఓరీ, దుర్మార్గుడా? ఎందుకిలా అధర్మం చేస్తున్నావు? ధైర్యం ఉంటే మా ఆయుధాలు మా కిచ్చి, మాతో యుద్ధంచెయ్యి. నీకు మేమేమి కీడు చేశాం? పైపెచ్చు మా అతిథిగా ఉంచుకున్నాం," అంటూ ధర్మపన్నాలు ప్రారంభించాడు.

అది చూసి సహదేవుడు, "వీడితో మాట లేమిటి? చాతనైతే వాణ్ణి చంపాలి. లేదా వాడి చేతిలో చావాలి. మరో మార్గం లేదు," అంటూ రాక్షసుడి మీదికి వచ్చాడు. అంత లోనే భీముడు ఎటు నుంచో వచ్చి పడ్డాడు. జటాసురుడు ధర్మరాజునూ, నకులుణ్ణీ, ద్రౌపదినీ కింద దించి భీముడితో కలియ బడ్డాడు. జటాసురుడు బలహీనుడైపోయే దాకా భీముడు వాడితో మల్లయుద్ధం చేసి, చివరకు వాణ్ణి పైకెత్తి, గిర గిరా తిప్పి నేలకేసి కొట్టి చంపేశాడు.

అందరూ ఆశ్రమానికి తిరిగి వచ్చారు. అర్జునుడింకా రాలేదు. అతను వెళ్ళి అయి దేళ్ళయింది. అతని కోసం నిరీక్షిస్తూ పాండ వులు ఆ ప్రాంతాల ఉండే ఇతర అందమైన పర్వతాలూ, ఆశ్రమాలూ చూస్తూకాలం వెళ్ళ బుచ్చారు.

ఒకనాడు పాండవులు నలుగురూ ఒక చోట కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండగా, ఒక విమానం ఆకాశంలో ప్రకాశిస్తూ కని పించి, వారున్న కొండ పక్కగా దిగింది. అందులో నుంచి దేవతా పురుషుడు లాగా అర్జునుడు దిగాడు.

స్వర్గం నుంచి తిరిగి వచ్చిన అర్జునుడు అన్నలకు నమస్కరించి, తమ్ములను కౌగ లించుకుని, వారి పక్కనే కూర్చున్నాడు.

పాండవులు ఇంద్రుడి రథాన్నీ, దాని అందాన్నీ వింతగా చూశారు; దానికి సారథి అయిన మాతలిని గౌరవించి, మర్యాదలు చేశారు; స్వర్గంలోని క్షేమ సమాచారాలు అడిగి తెలుసుకున్నారు. వారి ప్రశ్నల కన్నిటికీ మాతలి తగిన సమాధానాలు చెప్పి, రథాన్ని తిరిగి స్వర్గానికి తీసుకు పోయాడు.

ఇంద్రుడు అర్జునుడికి అనేక దివ్య వస్త్రాభరణాలు ఇచ్చాడు. అర్జునుడు వాటిని

ద్రౌపది కిచ్చి, ధర్మరాజు దగ్గిరే కూర్చుని, స్వర్గంలో తనకు కలిగిన అనుభవాలన్నిటినీ పూసగుచ్చినట్టు వివరించిఇలా చెప్పాడు:

"దితికి పులోమా, కాలకా అని ఇద్దరు కుమార్తెలు. వాళ్ళు బ్రహ్మను తమ తపస్సు చేత మెప్పించి, తమ సంతతికి దేవదానవుల చేత చావు లేకుండానూ, హిరణ్య అనే గొప్ప నగరం వారికి నివాసంగానూ వరాలు కోరారు. ఆ కారణంగా పౌలోములూ, కాలకేయులూ ఆ నగరంలో ఉంటూ, దేవతలను లక్ష్యపెట్టకుండా జీవిస్తూ వచ్చారు. నేను ఆ రాక్షసులను జయించిన అనంతరం, వారి నగరం ప్రవేశించాను. రథం నడవటం చాలా కష్టమయింది. దారికి అడ్డంగా రాక్షసుల శవాలు గుట్టలుగా పడివున్నాయి. నగరమంతటా రాక్షస స్త్రీల రోదనం వినిపించింది. రథం చప్పుడు విని ఆ స్త్రీలు ఇళ్ళలో దూరి దాక్కున్నారు. ఆ నగరం మొదట నిర్మించినప్పుడు దేవతల వశంలోనే ఉండేదనీ, ఇంద్రుడు అక్కడ ఉండేవాడనీ, బ్రహ్మవరం మూలంగా రాక్షసులు దేవతలను వెళ్ళగొట్టి ఆ నగరాన్ని ఆక్రమించుకున్నారనీ మాతలి నాకు చెప్పాడు. పౌలోమ, కాలకేయులను ఎలా నిర్మూలించటం అని ఇంద్రుడు బ్రహ్మను అడగగా, దేవదానవ జాతులకు చెందని వాడి వల్లనే అది సాధ్యమవుతుందని బ్రహ్మ చెప్పాడట. ఇంద్రుడు ఆ పనికి నన్ను నియోగించి, కాలకేయులను చంపటానికే నాకు దివ్యాస్త్రాలను ఇప్పించాడు. నేను ఆ దివ్యాస్త్రాలతో కాలకేయులను అవలీలగా జయించి వారి నగరంలో ప్రవేశించాను."

మర్నాడు, అందరూ కాలకృత్యాలు తీర్చుకున్న అనంతరం ధర్మరాజు అర్జునుణ్ణి పిలిచి, అతను సాధించుకు వచ్చిన అస్త్రాలను చూపమన్నాడు. అర్జునుడు శుచి అయి దేవదత్త మనే తన శంఖం మొదలుకుని తన వద్ద గల దివ్యాస్త్రాలన్నిటినీ చూపించసాగాడు.

ఆ సమయంలో నారదుడు వచ్చి అర్జునుడితో, "అర్జునా, ఈ అస్త్రాలను తగిన కారణం లేకుండా ఎన్నడూ ప్రయోగించకు. అందువల్ల చాలా ప్రమాదం ఉంటుంది. యుద్ధంలో వీటిని నువ్వు ప్రయోగించేటప్పుడు నేను వచ్చి చూస్తానులే!" అని చెప్పి వెళ్ళిపోయాడు.



# చందమామ కబుర్లు

## శాంతి విశ్వవిద్యాలయం

శత్రువులను ఎలా ఎదుర్కోవాలి? ఎలా ఎదురు దెబ్బ తీయాలి? యుద్ధం ఎలా చేయాలి? మొదలైన విషయాలలో సైనికులకు శిక్షణ ఇచ్చే సంస్థల గురించి విన్నాం. అదేవిధంగా ఉత్సాహవంతులైన యువతీ యువకులకు యుద్ధవిద్యలలో శిక్షణ ఇచ్చే సంస్థలూ ఉన్నాయి. అయితే, ఇరుగుపొరుగుతో సఖ్యతతో సహజీవనం సాగించడం ఎలా? శాంతిగా జీవించడం ఎలా? అని బోధించే ప్రత్యేక విద్యాలయాల గురించి ఇంతవరకు వినలేదు. అటువంటి శాంతి విశ్వవిద్యాలయ స్థాపనకు మన దేశంలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. దీనికి 'యునైటెడ్ ఎర్త్ పీస్ యూనివర్సిటీ' (సమైక్య ప్రపంచ శాంతి విశ్వవిద్యాలయం) అని నామకరణం చేశారు. మహారాష్ట్ర పూనే సమీపంలో సుప్రసిద్ధ జ్ఞాని జ్ఞానేశ్వర్ నివాసస్థానమైన ఆలంది అనే చిన్న పట్టణంలో ఈ విశ్వవిద్యాలయం వెలయనున్నది. నూతన సంవత్సరారంభంలోగా శంకుస్థాపన జరగనున్న ఈ పథకానికి 30 కోట్ల అమెరికన్ డాలర్లు వ్యయం కావచ్చునని భావిస్తున్నారు.

## కవితల గోడ!

చైనాలోని హునాన్ రాష్ట్ర మధ్య ప్రాంతంలో గల చాంగ్డే నగరంలో వెల్లువలను అడ్డుకునేందుకు 2.5 కి.మీ దూరం ఒక దృఢమైన గోడను నిర్మిస్తున్నారు. అయితే, ఈ గోడను కేవలం వెల్లువలను ఆపడానికి మాత్రమే కాకుండా మరొకవిధంగా కూడా ఉపయోగించు కోవాలని నగరప్రజలు భావించారు. గోడ లోపలివైపును కవితలతో అలంకరించనున్నారు. ఈ గోడ మీద దాదాపు 1000 కవితలను రాయించాలని నిర్ణయించారు. ఇందులో ప్రాచీన, ఆధునిక కవుల కవితలు చోటుచేసుకుంటాయి. చైనాను 1949 నుంచి 1976 వరకు పరిపాలించిన చైనా నేత మావో సేటుంగ్, చాంగ్డే సమీపంలో జన్మించాడు. చైనా ఆధునిక కవులలో మున్నెన్నదగిన గొప్ప కవి మావో అన్నది ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషం!

## పొగనుంచి శక్తి!

పట్టణాలలో పోగయ్యే చెత్తాచెదారానికి నిప్పంటించినప్పుడు పొగమంటలు పుడతాయి. అవి కూడా ఒక రకమైన శక్తి అయినప్పటికీ అవి ఉపయోగపడడం లేదు. వాటిని కూడా ఉపయోగించుకునేందుకు తాయ్‌వాన్‌లో ఒక మార్గం కనుగొన్నారు. పైటోన్ నగర శివార్లలో చెత్తాచెదారం తగలబెట్టే చోటుకు పైన రెస్టారెంట్ నిర్మిస్తున్నారు. ఇక్కడ 150 అడుగుల ఎత్తయిన పొగగొట్టం ఉన్నది. ఇక్కడ నిర్మించే రెండంతస్తుల రెస్టారెంట్ భూమికి 120 అడుగుల ఎత్తులో ఉంటుంది. పొగగొట్టం చుట్టూ కదిలే రెస్టారెంట్‌లో 100 మంది కూర్చోవచ్చు. పై అంతస్తులో 12 బైనాకులర్లు అమర్చనున్నారు. ఇది పూర్తయిందంటే, ఈ రకమైన రెస్టారెంట్లలో ప్రపంచంలో ఇదే మొట్టమొదటిది అవుతుంది.

## ఇళ్ళుగా మారుతూన్న గుహలు!

చైనాలో దాదాపు నలభైలక్షల మంది గుహలలో నివసిస్తున్నారు. వాళ్ళు పట్టణాల వైపు ఆకర్షింపబడి, ఉద్యోగాలు వెతుక్కుని క్రమంగా పట్టణాలలోనే స్థిరపడిపోతున్నారు. ఇలాంటివాళ్ళు ఖాళీ చేసే గుహలకు ఆధునిక సౌకర్యాలుకల్పించి, వాటిని అందమైన ఇళ్ళుగా మార్చే పథకాన్ని ప్రభుత్వం చేపట్టింది. పక్షి గూళ్ళలాంటి ఫ్లాట్స్‌లో విసుగు చెందినవారికి ఇటువంటి గుహలఇళ్ళు ఆకర్షణీయంగా ఉండగలవని ప్రభుత్వం భావిస్తున్నది! వాయవ్య చైనాలోని లోస్ పీఠభూమిలోని గుహలను ఆధునికం చేయడానికి గృహనిర్మాణ కార్మికులు పనిచేస్తున్నారు. గాన్సు, హెనాన్, షాన్సీ, ప్రాంతాలలోని గుహలు అప్పుడే ఇళ్ళుగా తయారయ్యాయి. విద్యుచ్ఛక్తిని పొదుపు చేస్తూ ప్రకృతిని పరిరక్షించడం వల్ల ఈ గుహలఇళ్ళు అంతర్జాతీయ వాస్తుశిల్పుల దృష్టిని కూడా ఆకర్షిస్తున్నవి!

| చందమామ అనుబంధం - 98 | మనదేశపు చెట్లు |
| --- | --- |

# పెద్ద కాళింగ

ఈ శీర్షికలో మనం తెలుసుకుంటూన్న చెట్లన్నీ మన దేశంలో పుట్టినవి కావు. చాలా చెట్లు ఎక్కడెక్కడో పుట్టి భారత ఉపఖండంలోకి వ్యాప్తి చెందినవి. అయితే పెద్ద కాళింగ వంటి చెట్లు మాత్రం మన దేశానికే చెందినవి. వృక్షశాస్త్రంలో దీనిని దిల్లేనియా ఇండికా అని అంటారు. ఇండికా అంటే ఇండియాకు చెందినది అని అర్థం.

దీనిని హిందీలో చల్తా అనీ, బెంగాలీ, మలయాళీ భాషలలో చలిత అనీ, ఒరియాలో చలోతా అనీ, గుజరాతీలో కారంబాల్ అనీ, మరాఠీలో కర్మాల్ అనీ, కన్నడంలో బెట్టడ కనగాల్ అనీ అంటారు.

పశ్చిమబెంగాల్, బీహార్, అస్సాం రాష్ట్రాలలో ఈ చెట్లు విరివిగా కనిపిస్తాయి. ఇతర ప్రాంతాలలో కూడా అక్కడక్కడ ఉన్నాయి. నిటారుగా పెరిగే ఈ చెట్ల కొమ్మలు గుండ్రటి కిరీటంలాగా ఉంటాయి. చెట్టు బెరడు మెత్తగా ఉన్నప్పటికీ పొరలు పొరలుగా ఉంటుంది. ఈ చెట్లు 10-20 మీ॥ ఎత్తు పెరుగుతాయి. కొమ్మలు అన్ని వైపులకూ ఉంటాయి.

ఆకులు పచ్చగా ఎప్పుడూ నిగనిగలాడుతూ ఉంటాయి. ఇవి కొమ్మల చివర వెడల్పుగా, మొనదేలి ఉంటాయి. ఆకుల అంచులు రంపపు పళ్ళలాగా ఉంటాయి. పళ్ళకు సమాంతరంగా ఈనెలు ఉంటాయి.

సువాసనలు వీచే పెద్ద పెద్ద పువ్వులు తెల్లగా ఉంటాయి. కొమ్మల చివర విడివిడిగా పూస్తాయి. ఈ చెట్లు జూన్- జూలై నెలలలో పూస్తాయి. వీటి కాయలు పెద్దవిగా అంటే, దాదాపు 8-12 సెం.మీ అడ్డుకొలతతో ఉంటాయి. పై తొక్క గట్టిగా ఉంటుంది. లోపల గుజ్జు మధ్య, వీటి గింజలు పెద్ద చిక్కుడు గింజల్లా ఉంటాయి.

మన దేశం పశ్చిమప్రాంతంలో ఉండే ఒక జాతి దిల్లీనియా చెట్ల ఆకులు అరటి ఆకుల్లా పెద్దవిగా ఉంటాయి.



మనదేశపు ఋషులు:

# బలాకి

మన ప్రాచీన ఋషులు ఎంత తెలుసుకున్నా ఇంకా తెలుసుకోవాలనే జిజ్ఞాస కలిగిన వారు. దశ దిశల నుంచీ విజ్ఞాన దీప్తులు తమ హృదయాలను వెలుగుతో నింపాలని ఆశించిన మహనీయులు. అన్నిటికీ మించి వినయ సంపన్నులు.

ఈ సంప్రదాయానికి భిన్నంగా బలాకి అనే మునికుమారుడు విద్యాభ్యాసం ముగించగానే తనకు అన్నీ తెలుసుననే గర్వం పెంచుకున్నాడు. ఎంతటి జ్ఞానులకైనా సరే జ్ఞానబోధ చేయగలనని విర్రవీగ సాగాడు. అందుకే అతన్ని అందరూ దృప్త (గర్వ) బలాకి అని పిలువసాగారు.

కాశీరాజు గొప్ప జిజ్ఞాసి, జ్ఞాన పిపాస కలవాడు– అని ఎవరో చెప్పుకుంటూండగా బలాకి విన్నాడు. అతడు వెంటనే కాశీనగరానికి బయలుదేరి వెళ్ళి, కాశీరాజును కలుసుకుని, ఆయనకు బ్రహ్మజ్ఞానం బోధించ గలనని చెప్పాడు. రాజు అందుకు ఎంతో సంతోషించి, అలాగే బోధించమన్నాడు. అయితే, బలాకి ఏ మంత్రాన్ని, శ్లోకాన్ని, అర్థాన్ని చెప్పడానికి నోరు విప్పినా, కాశీరాజు దానిని అతనికన్నా ముందుగానే పూర్తి చేయ సాగాడు. కాశీరాజు తనను మించిన జ్ఞాన సంపన్నుడని బలాకి గ్రహించాడు. తన గర్వానికీ, అజ్ఞానానికీ సిగ్గు పడ్డాడు. అంతేకాదు. కాశీరాజుకు క్షమాపణలు చెప్పుకుని ఆయన శిష్యుడుగా చేరాడు.

ఒకనాడు రాజు బలాకికి నిద్రిస్తూన్న ఒక మనిషిని చూపి – అతను నిద్రిస్తూన్నప్పుడు అతని స్పృహ ఎక్కడ ఉంటుంది? అని అడిగాడు. బలాకి సమాధానం చెప్పలేక మౌనం వహించడంతో రాజే ఇలా వివరించాడు: సుషుప్తిలో అంటే గాఢనిద్రలో ఉన్న మనిషికి స్పృహ లేకపోయినప్పటికీ అతడు అనిర్వచనీయమైన తురీయా నందాన్ని అనుభవిస్తాడు. ఎందుకంటే ఆ స్థితిలో అతని ఆత్మ దేవుడికి సమీపంలో సంచరిస్తుంది. మనిషి జాగ్రదావస్థలో అంటే, మేలుకుని ఉన్నప్పుడు కూడా అటువంటి తురీయానంద స్థితిని పొందగలిగాడంటేనే అతడు నిజమైన ఆత్మజ్ఞానం, ఆత్మనిగ్రహం కలవాడని చెప్పవచ్చు.



# మీకు తెలుసా?

1. 'కథా సరిత్సాగరం' రచించిన వారెవరు?
2. డైనమైట్‌లో ప్రధానంగా ఉన్న రసాయనిక పదార్థం ఏది?
3. హోమర్, మిల్టన్, హెలెన్ కీలర్, వేద్ మెహతా– వీరి మధ్య ఉన్న సామ్యం ఏమిటి?
4. భారత రాజ్యాంగ శాసనంలో ఆస్తి హక్కును, ప్రాథమిక హక్కుల నుంచి తొలగించిన సవరణ ఏది?
5. 'భారతీ దాస' కలంపేరుతో రచనలు చేసే రాజకీయనాయకుడు ఎవరు?
6. మేగసేస్సే అవార్డును మొట్టమొదట అందుకున్న భారతీయుడు ఎవరు?
7. నోబెల్ శాంతి బహుమతిని మొట్టమొదట అందుకున్న సంస్థ ఏది?
8. యేటా డిసెంబర్ 10వ తేదీ నోబెల్ బహుమతులు ప్రదానం చేస్తారు. ఆ తారీఖు ప్రాముఖ్యత ఏమిటి?
9. 'లిబర్టీ' విగ్రహానికి రూపకల్పన చేసిన వారెవరు?
10. ఐక్యరాజ్య సమితి అధికారభాషలు ఏవి?
11. ఐక్యరాజ్య సమితి చార్టర్ (పత్రం) ఎప్పుడు అమలులోకి వచ్చింది?
12. ఐక్యరాజ్య సమితి భద్రతామండలిలో శాశ్వత సభ్యత్వం కావాలని భారతదేశం ఎప్పుడు కోరింది?
13. 'రెవెన్యూ స్టాంపు' అనే స్వీయచరిత్ర రచయిత ఎవరు?
14. భారతదేశంలో ఇంగ్లీషును అధికారభాషగా స్వీకరించిన రాష్ట్రం ఏది?
15. మనదేశంలోని మొట్టమొదటి నేషనల్ హైవే ఏది?
16. రానున్న 'వరల్డ్ కప్ క్రికెట్' ఏదేశంలో జరుగనున్నది?

## సమాధానాలు

1. సోమదేవుడు.
2. నైట్రోగ్లిజరిన్.
3. అంధులైనప్పటికీగొప్ప గ్రంథాలు రచించారు.
4. 1978వ సం॥లో తీసుకు వచ్చిన 44వ సవరణ.
5. అటల్ బిహారీ వాజ్‌పాయ్.
6. ఆచార్య వినోబాభావే
7. బెల్జియంలోని అంతర్జాతీయ చట్ట సంస్థ.
8. ప్రపంచ మానవ హక్కుల దినం.
9. ఫ్రెడరిక్ అగస్టే బార్తోల్డీ.
10. అరబిక్, చైనీస్, ఇంగ్లీష్, ఫ్రెంచ్, రష్యన్, స్పానిష్.
11. 1945' అక్టోబర్ 24.
12. 1994 అక్టోబర్ 3.
13. అమృతా ప్రీతమ్.
14. నాగాల్యాండ్.
15. ఢిల్లీ నుంచి చండీఘడ్‌కు.
16. ఇంగ్లాండు.

# అధికారబలం!

జటావల్లభుడనే ఉపాధ్యాయుడు, మొదటిసారిగా నగరానికి వెళ్ళి, బసచేసేందుకు ఒక సత్రంలో అడుగుపెట్టాడు. అక్కడ అంతా గొప్ప సందడిగా వున్నది. కొందరు జూదం ఆడుతున్నారు. మరికొందరు మత్తుపానీయాలు తాగుతున్నారు. ఇది యాత్రికుల సత్రమా లేక పానశాలా, అని అతడు ఆశ్చర్యపోతున్నంతలో, ఎవరో, "ఇదె వచ్చె, వచ్చె, గండరగండడు!" అంటూ కేకపెట్టారు.

అంతే! తాగేవాళ్ళూ, జూదాలాడే వాళ్ళూ దాపుల తెరిచి వున్న ద్వారం నుంచి బయటికి పరిగెత్తారు. అదే సమయంలో మరొక వైపున మూసివున్న ద్వారాన్ని ఎవరో గట్టిగా తన్నడంతో తలుపులు ఫెళఫెళ మంటూ విరుచుకు పడినై.

జటావల్లభుడు నివ్వెరపోతూ అటుకేసి చూసేంతలో, ఆరడుగుల ఆజానుబాహువొకడు – కండలు తిరిగిన దేహం, కోరమీసాలు, నిప్పులు చెరుగుతున్న కళ్ళతో లోపలికి వస్తూనే, "దాహం! దాహం! ఒరే, ఆ చెక్కబల్లమీద వున్న పానీయం బిందె ఇటందుకో!" అంటూ జటావల్లభుడికేసి గుడ్లురిమాడు.

"అయ్యో, నేరక వచ్చి ఈగండరగండడి కళ్ళపడితినే!" అనుకుంటూ, వణుకుతున్న చేతులతో పానీయం బిందె ఎత్తి, ఆ వచ్చిన వాడి కందించాడు జటావల్లభుడు.

వాడు బిందెఎత్తి, అందులోని పానీయాన్ని గటగట మంటూ తాగి, దిక్కులు చూసేంతలో, జటావల్లభుడు వాణ్ణి మంచి చేసుకుందామని, "అయ్యా, తమకు పానీయం గాని, తినేందుగ్గాని ఏమైనా కావాలా?" అని అడిగాడు.

"తాగాలనీ వుంది, తినాలనీ వుంది. కాని, గండరగండడు ఇటు వస్తున్నాడని వినలేదా, చెవిటివెధవా? అదిగో వచ్చేస్తున్నాడు!" అంటూ వాడు వచ్చినదారినే పారిపోయాడు.

ఇంతలో ఐదడుగుల ఎత్తు కూడా లేని ఒకడు అక్కడికి వస్తూ, వెనకవున్న పదిమంది సాయుధభటులను పీలగొంతుతో, "ఒరేయ్, నేనొస్తున్నట్టు పసిగట్టి జూదరులూ, తాగుబోతులూపారిపోతున్నారు. వాళ్ళను తరిమి పట్టండి. ఈలోపల నేను, సత్రాన్ని జూదగృహంగా మార్చిన దీని యజమానికి సంకెళ్ళు తగిలిస్తాను!" అన్నాడు.

సామాన్యజనం భయపడేది, మనుషుల దేహబలాన్ని చూసికాదనీ, వాళ్ళ వెనకవున్న అధికారబలాన్ని చూసనీ గ్రహించిన జటావల్లభుడు, చిన్నగా నవ్వుకున్నాడు. – ఆర్. సత్య






# పంచుకుంటే సంతోషం

సూరయ్య పనిమీద పట్నం బయల్దేరాడు. దారిలో తినడానికి భార్య అతడికి మూడు రొట్టెలు ఇచ్చింది. దగ్గర దారి కదా అని అడవిలోంచి కొంతదూరం వెళ్ళేసరికి, ఒక యువకుడు హఠాత్తుగా అతణ్ణి అటకాయించాడు.

ఆ యువకుడు చూడ్డానికి గొప్పింటి బిడ్డలా ఉన్నాడు. బట్టలు ఖరీదైనవే కానీ మాసి వున్నాయి. యువకుడు ముందుగా తనకు తినడానికేమైనా ఇవ్వమని అడిగాడు. సూరయ్య ఇవ్వనన్నాడు. అప్పుడు వాడు బలవంతంగా సూరయ్య దగ్గరున్న రొట్టెలు లాక్కుని ఆబగా తినేశాడు. తను తినడానికేమీ మిగల్లేదని సూరయ్య లబోదిబోమన్నాడు. ఆ యువకుడదేం పట్టించుకోకుండా, "నీకు దాపులనున్న భద్రగిరి తెలుసా?" అని అడిగాడు సూరయ్యను. తెలుసునన్నట్టు తలూపాడు సూరయ్య.

"పట్నం నుంచి భద్రగిరి వెళుతూ, ఈ అడవిలో దారి తప్పాను. రెండు రోజులుగా తిండీతిప్పలు లేవు. ఇప్పుడు నా ప్రాణం కాస్త తేరుకుంది. నువ్వు నన్ను భద్రగిరి చేర్చు. భద్రగిరి జమీందారు మా నాన్న. ఆయన నీకు మంచి బహుమతి ఇస్తాడు," అన్నాడు ఆ యువకుడు.

బహుమతికాశపడి సూరయ్య, ఆ యువకుణ్ణి అక్కణ్ణించి భద్రగిరికి తీసుకుని వెళ్ళాడు. జమీందారు సంతోషించి సూరయ్యకు ముత్యాలహారం కానుకగా ఇచ్చాడు.

తను చేసిందానికి అంత గొప్ప ప్రతిఫలం వస్తుందని సూరయ్య అనుకోలేదు. ఆ ముత్యాలహారం చాలా విలువైనదని చూడగానే తెలిసిపోతున్నది. అందువల్ల సూరయ్య సంతోషాన్ని మాటల్లో వర్ణించడం కష్టం.

సూరయ్య ముత్యాలహారం మెడలో వేసుకున్నాడు. పట్నం ప్రయాణం ఆలోచన

జొన్నలగడ్డ రామలక్ష్మి



మానుకున్నాడు. వెంటనే తన ఊరుకు తిరిగి వెళ్ళాడు. తనకు పట్టిన ఈ అదృష్టం గురించి, తెలిసినవాళ్ళకు చెప్పుకోవాలని అతడికి ఉబలాటంగా ఉంది.

ముందుగా అతడికి గోవిందం ఎదురయ్యాడు. హడావిడిగా ఎక్కడికో పోతున్న గోవిందాన్ని ఆపి, "నా మెడలో ముత్యాల హారం చూశావా? ఇది భద్రగిరి జమీందారుది. ఆయన నాకిది కానుకగా ఇచ్చాడు," అన్నాడు.

గోవిందం అతడు చెప్పింది పెద్దగా పట్టించుకోక, "లచ్చన్న కూతురుకు పెళ్ళి కుదిరిందట. ఊరందరికీ సంతోషవార్త ఇది. ఏ సాయం కావల్సినా చేస్తానని లచ్చన్నకు చెప్పడానికి వెళుతున్నాను. నువ్వూ వస్తావా?" అని అడిగాడు.

లచ్చన్న కూతురు తెలివైనది. పనిమంతురాలు. చూడ్డానికి బాగుంటుంది కానీ కుడి కన్ను కాస్త మెల్ల. అందువల్ల ఏ సంబంధం కుదరకుండా వుంది. ఊరందరికీ లచ్చన్న మీద జాలి. ఆ పిల్లకు పెళ్ళి కుదరాలని అంతా కోరుకుంటున్నారు. ఆ విషయం సూరయ్యకు తెలుసు. అయినా గోవిందం తనకు పట్టిన అదృష్టం గురించి పట్టించుకోకుండా మరొక విషయం మాట్లాడడం నచ్చక, "నాకిప్పుడు వేరే పనుందిలే!" అంటూ ముందుకు నడిచాడు.

అంతలో సూరయ్యకు, బడిపంతులు పూర్ణానందం ఎదురయ్యాడు. సూరయ్య తన మెడలో హారాన్ని పంతులుకు చూపించి, "ఇది మామూలుది కాదు. భద్రగిరి జమీందారుది. ఆయన నాకిది కానుకగా ఇచ్చాడు," అన్నాడు.

"అలాగా, బాగుంది!" అని మాటవరసకు అని, "మన ఊరి పండితుడు రామశాస్త్రికి రాజధానిలో రాజసన్మానం జరిగిందిట. ఇది ఊరందరికీ గర్వకారణం. రామశాస్త్రి తిరిగి నిన్న వచ్చాడట. చూడ్డానికి వెళుతున్నాను. నువ్వు కూడా వస్తావా?" అనడిగాడు పూర్ణానందం.

"నేనేదో చెబుతుంటే, ఇంకెవరి గురించో చెబుతాడేమిటీ?" అని సూరయ్య మనసులో విసుక్కుని, "నాకిప్పుడు వేరే పనుందిలే. నేను రాలేను," అంటూ ముందుకు సాగిపోయాడు.

సూరయ్య కొంతదూరం నడిచి, ఒక పక్క సందు తిరిగేసరికి, అతడికి నాగరాజు ఎదురయ్యాడు. హడావిడిగా పోతున్నవాడల్లా

సూరయ్యను చూసి ఆగి, "నీ మెడలో ఏదో మెరుస్తున్నదే! హారమా? పట్నంలో కొన్నావా? చూడ్డానికి ముత్యాల్లా ఉన్నాయి. నకిలీవా, మంచివా? ఎంతయిందేమిటి?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

తను చెప్పకుండానే హారం గురించి అడిగినందుకు సూరయ్య చాలా సంతోషించి, "ఇది అసలు సిసలు ముత్యాల హారం. భద్రగిరి జమీందారుది. కొనడం నా వల్లవుతుందా? ఆయన ఊరికే కానుకగా ఇచ్చాడు కాబట్టి, ఇలా మెడలో వేసుకోగలిగాను," అన్నాడు గొప్పగా.

నాగరాజు అతణ్ణింకేమీ ప్రశ్నించలేదు. సూరయ్య చెప్పింది పట్టించుకోకుండా, "ఇది విన్నావా? మన వెంకప్పది మెట్టపొలం కదా, రెండేళ్ళుగా వానలు లేక పంటలు లేవు కదా- నిన్ననే బావిలో నీళ్ళు పడ్డాయట. వెంకప్ప కష్టాల నుంచి బయట పడ్డాడని అంతా సంతోషిస్తున్నారు. ఒకసారి పలకరించి వద్దామని బయల్దేరాను. నువ్వూ నాతో వస్తావా?" అన్నాడు.

సూరయ్యకు చాలా ఉక్రోషం వచ్చింది. ఒక్కరూ తన అదృష్టాన్ని పొగడడం లేదు. జమీందారు, నీకా హారాన్ని ఎందుకిచ్చాడని అడగడం లేదు. అలాగే, ఎదురైన మరిద్దర్ని దాటుకుని మరింత విసుగుతో ఇల్లు చేరాడు సూరయ్య,

భార్య అతడి మెడలో హారం చూసి, వివరాలడిగి తెలుసుకుని, "ఎంత అదృష్టమో! ఎన్నాళ్ళనుంచో ముత్యాలహారం చేయించుకుందామనుకుంటున్నాను. అది ఇలా వచ్చింది!" అంటూ సంతోషించింది.



"ఈ హారం మగాళ్ళది. జమీందారు తన మెడలోంచి తీసిచ్చాడు," అన్నాడు సూరయ్య వెంటనే.

సూరయ్య భార్య నవ్వి, "హారాలు మగాళ్ళకీ, ఆడవాళ్ళకీ అంటూ వేరువేరుగా వుండవు. కలిగినవాళ్ళు మగాళ్ళు వేసుకుంటారు. మన బోటి అంతగా లేనివాళ్ళింట్లో మగాళ్ళేసు కోరు. ఆడవాళ్ళే వేసుకుంటారు," అన్నది.

"అయినా, ఇది నా గొప్పతనానికి కానుకగా జమీందారు నుంచి వచ్చింది. కాబట్టి నా మెడలోనే వేసుకుంటాను," అన్నాడు సూరయ్య మొండిగా.

"ఏందయ్యా నీ గొప్పతనం? అడిగిన మనిషికి రొట్టెలైనా పెట్టావా? వాడు బలవంతంగా లాక్కుని తినేస్తే, చేతకాని వాడిలా ఏడ్చావు. జమీందారు బిడ్డని తెలిసి ఏదైనా

కానుక ఇవ్వకపోతాడా అని ఆశపడి, వాడిని ఇంటికి చేర్చావు. అంతా అదృష్టమే తప్ప, నీ గొప్పతనమేముంది? అసలు నేను రొట్టెలు చేసి ఇవ్వకపోతే, ఆ జమీందారు బిడ్డకు నీతో మాట్లాడే ఓపికే వచ్చేది కాదు. నిజానికి నీ అదృష్టమంతా నా వల్లనే. ఆ విషయం నా జాతకంలో కూడా రాసి వుంది," అన్నది సూరయ్య భార్య.

"అందరి కందరే! ఊళ్ళో వాళ్ళకే అనుకుంటే, కట్టుకున్న పెళ్ళానిక్కూడా నేనంటే అసూయే!"అన్నాడు సూరయ్య విసుగ్గా.

"ఊళ్ళో వాళ్ళకు నువ్వంటే అసూయా? ఎందుకూ– నీలో ఏ గొప్ప గుణముందని వాళ్ళసూయపడతారు?" అన్నది సూరయ్య భార్య నిలదీస్తూ.

అప్పుడు సూరయ్య తను ఊళ్ళో అడుగు పెట్టినప్పటి నుంచీ, తనకైన అనుభవాలన్నీ చెప్పి, "ఒకరా, ఇద్దరా, మొత్తం అయిదు గురు! ఒక్కరంటే ఒక్కరు నా అదృష్టాన్ని పొగడలేదు. నీకీ హారమెలా వచ్చిందీ అని అడగలేదు. అదంతా అసూయ కాకపోతే మరేమిటి?" అన్నాడు.

"అది అసూయ ఎందుకవుతుంది? నువ్వెప్పుడైనా, ఊళ్ళో ఎవరికైనా మంచి జరిగితే కుతూహలం చూపించావా?ఒక మంచి మాటన్నావా? వాళ్ళ సంతోషంలో పాలు పంచుకున్నావా?అదేం లేకుండా,నిన్ను చూసి మాత్రం సంతోషించమంటే సంతోషిస్తారా? సంతోషానిక్కూడా ఇచ్చి పుచ్చుకోవడాలుంటాయి," అన్నది సూరయ్య భార్య.

ఆమె అలాగనేసరికి సూరయ్య నిశ్చేష్టుడై, తన గురించి ఆలోచించుకోసాగాడు. అంతలోనే అతడి భార్య అందుకుని, "నీ కెదురైన ప్రతి ఒక్కరూ, ఇతరుల మంచి గురించో, లాభం గురించో మాట్లాడారు. నీకు మాత్రం నీ గురించి తప్ప ఇంకో ఆలోచన లేదు.



ఇన్నేళ్ళ సంసారంలో నాకు ఒక్కగానొక్క నగైనా చేయించావా? అయాచితంగా నగ వస్తే కూడా, మగవాడివైనా సరే- నువ్వే వేసుకుందామనుకుంటున్నావు; ముచ్చటగా పెళ్ళానికిద్దామన్న ఆలోచనే లేదు నీకు. ఉత్త స్వార్థపరుడివి!" అంటూ ఈసడించింది.

ఏమనుకున్నాడో సూరయ్య వెంటనే తన మెడలోని హారం తీసి భార్యకిచ్చి, "ఇది నేనేం చేసుకుంటానే! దీనిని నీకే ఇద్దామనుకున్నాను. కాసేపు నాటకమాడితే, ఈ లోగా నువ్వు తేలిపోయి నన్ను మాటలంటున్నావు," అన్నాడు.

అతడి భార్య వెంటనే హారాన్ని మెడలో వేసుకుని, చటుక్కున వంగి, అతడి రెండు పాదాలనూ చేత్తో తాకి దణ్ణం పెట్టి, " నా బుద్ధి చిన్నది. అందుకే అలా మాట్లాడాను. నీ బుద్ధి దొడ్డది. అందుకే భద్రగిరి జమీందారంతటి వాడు సన్మానించాడు. మాటలన్నా నాక్కూడా కానుకలిచ్చేంత గొప్పవాడివి. ఇంత విశాల హృదయమున్న నువ్వు, నా మగడివి కావాలని ఎన్ని జన్మలు పూజలు చేసి ఉంటానో!" అన్నది. ఈ మాటలు వినగానే సూరయ్యకు కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు. అయితే భార్య అంతలోనే తననంతలా పొగడినందుకు అతడికెంతో సంతోషం కలిగింది.

సూరయ్య వెంటనే ఇల్లు విడిచి ముందుగా లచ్చన్న ఇంటికి వెళ్ళాడు. కూతురుకు పెళ్ళి కుదిరినందుకు సంతోషమనీ, తను చేయగలిగిన సాయం చేస్తాననీ మాట ఇచ్చాడు. అక్కణ్ణించి, రామశాస్త్రి ఇంటికి వెళ్ళి,ఆయనకు జరిగిన రాజసన్మానం వివరాలన్నీ తెలుసుకున్నాడు. ఆ తర్వాత వెంకప్ప మెట్టపొలానికి వెళ్ళి, ఊటబావిని చూసి ఎంతో సంతోషించి, అందులోని నీళ్ళు కాసిని తాగి వాటి రుచిని కూడా ఎంతగానో మెచ్చుకున్నాడు.

ఆ విధంగా అన్ని ఇళ్ళూ తిరిగి ఇల్లు చేరాక, సూరయ్యకు ఎంతో సంతోషంగా ఉన్నది. ఆ రాత్రి అతడికి హాయిగా నిద్ర పట్టింది. మర్నాడు నిద్ర లేచేసరికి, అతడింటి ముందు ఊరి జనమంతా ఉన్నారు.

భద్రగిరి జమీందారు ముత్యాలహారాన్నిచ్చిన వివరాలన్నీ సూరయ్య నడిగి తెలుసుకోవాలనీ, ఆ హారాన్ని స్వయంగా చూడాలనీ వాళ్ళంతా వచ్చారు.





# అరువు సొమ్ము

కమల తండ్రి పేదవాడు. భార్య పోయాక, తనే తల్లీ తండ్రీ అయి ఆమెను పెంచాడు. దేవుడు ఆస్తి అంతస్థులైతే ఇవ్వలేదుకానీ, అపురూపమైన అందాన్ని మాత్రం కమలకు ఇచ్చాడు. అద్దం ఒక్కటే అందరికీ అందాన్ని చూపుతుంది, కానీ అందరూ కమల అందాన్ని పొగిడేవారే! తనొక అందగత్తెనన్న విషయం ఆమె గ్రహించింది. యుక్తవయస్సు వచ్చాక, తన అందానికి తగినట్టు ఏ జమీందారు కొడుకో తన కోసం వస్తాడనీ, తనను ఐశ్వర్యంలో ఓలలాడిస్తాడనీ ఆమె కలలు కన సాగింది.

కమలను పెళ్ళిచేసుకుంటానని చాలా మందివచ్చారు. అలా వచ్చిన వాళ్ళందరూ మధ్యతరగతి కుటుంబాలలోని వాళ్ళే! వాళ్ళు అతిగా కట్నకానుకలకు ఆశపడటం వలన, అవి ఇచ్చుకునే స్థితిలో కమల తండ్రి లేక పోవడం వలన, ఆ సంబంధాలేవీకుదరలేదు.

ఈ పరిస్థితుల్లో, పట్నంలో పనిచేస్తున్న శివస్వామికి, కమల ఎంతో నచ్చింది. అతడికి తల్లీ తండ్రీ లేరు. కట్నం లేకుండా నిరాడంబరంగా పెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకున్నాడు. బంధువులందరూ కమల అదృష్టాన్ని ఎంతో పొగిడారు. కమల మాత్రం దిగులు పడిపోయింది. తన వివాహంతో తన దశ తిరుగుతుందనీ, తన అందం తనను అందలం ఎక్కిస్తుందనీ ఆమె కన్న కలలు, కలలుగానే వుండిపోయాయి.

కమల పట్నానికి శివస్వామితో కాపురానికి వెళ్ళింది. శివస్వామికి ఉండటానికి సొంత ఇల్లువుంది.తిండికి లోటులేదు. అతడికి కమల అంటే ఎంతో ప్రేమ. కాని కమల మనస్సులో మాత్రం ఏదో వెలితి వుండిపోయింది. తనకు పట్టుచీరలు, నగలు లేకపోవటం, ఆమెకు ఒక పెద్ద లోటుగా కనిపించేది.

రామవరపు గణేశ్వరరావు

ఒకసారి శివస్వామి దూరపు బంధువు, అతణ్ణి పెళ్ళికి పిలవడానికి గ్రామం నుంచి పట్నానికి వచ్చాడు. లోగడ అతడు శివస్వామికి కష్టాలలో ఉన్నప్పుడు చాలా సహాయంచేశాడు. శివస్వామి, కమలతో పెళ్ళికి వెళదామన్నాడు సంతోషంగా. కాని కమల ఏమాత్రం ఉత్సాహం చూపలేదు.

"నన్ను ఏ ముఖం పెట్టుకుని బయలు దేరమంటారు? నా బోసి మెడను చూసి పెళ్ళిలో నలుగురూ నవ్వరా? కట్టుకోడానికి నాకు ఒక మంచి చీరైనా లేదు. నేను రాను. మీరు కావలిస్తే వెళ్ళండి," అన్నది కమల చిరుకోపంగా.

శివస్వామి మారు మాట్లాడకుండా హుటా హుటిగా వెళ్ళి, తన యజమాని దగ్గర కొంత అప్పుతీసుకున్నాడు. ఉన్నంతలో ఒక పట్టుచీర కొన్నాడు. పెద్ద జరీ అంచుతో, మందారం రంగులో అది చూడ ముచ్చటగా వుంది. దారిలో గుప్పెడు మల్లెపూలు కొని, ఇల్లు చేరుకున్నాడు.

అతడు కొత్తచీర, మల్లెపూలను భార్య కిస్తూ, "కమలా! ఏ నగలూ ఇవ్వలేని అందం నీది. అయినా శుభకార్యానికి ఏ అలంకరణ లేకుండా వెళ్తే బావుండదు. ఒక పని చేద్దాం. పక్కింటి కాంతంగారి మెడనిండా నగలే! పెళ్ళికి వెళ్ళి రెండురోజుల్లో తిరిగి వస్తాంగదా, తన నగ ఒకటిఅరువిస్తుందేమో ఆమెనడిగి చూడు!" అన్నాడు.

కమల అయిష్టంగానే కాంతాన్ని అడిగింది. కాంతం బీరువాలోని నగల పెట్టె తెచ్చి, ఆమె ముందుపెట్టింది. అందులోని చంద్రహారం కమలకెంతోనచ్చింది. రెండురోజుల్లో తిరిగి ఇచ్చేస్తానని చెప్పి, ఆమె చంద్రహారంతీసు కున్నది.

శివస్వామి, కమల ఎద్దుబండి మీద మూడు గంటలు ప్రయాణం చేశాక, పెళ్ళి





వారిల్లు చేరుకున్నారు. పెళ్ళి మర్నాడుపొద్దున పదిగంటలకు. మర్నాడు చీకటినే స్నానం అయ్యాక, కమల కొత్త చీర కట్టుకున్నది. మెడలో అరువుతెచ్చిన చంద్రహారం వేసుకున్నది. తలలో మల్లెలు తురుముకున్నది. అసలే అందగత్తె, ఆ కొద్దిపాటి అలంకరణతో సానబట్టిన వజ్రంలా తయారైంది. పెళ్ళికి వచ్చిన వారందరి చూపూ ఆమె మీదే.ఇదంతా గమనిస్తున్న కమల ఆనందానికి హద్దులేకుండా పోయింది.

పెళ్ళయిన మర్నాడే భార్యాభర్తలు పట్నం తిరిగివచ్చారు. కాంతం నగను తిరిగి ఇద్దామని పెట్టె తెరిచిన కమల కెవ్వుమన్నది. చంద్రహారం అందులో లేదు. పెళ్ళి సమయంలో పెట్టుకున్న నగ, రోజంతా అలాగే ఉంచి సాయంత్రం స్నానం అయ్యాక పెట్టెలో పెట్టినట్టు కమలకు జ్ఞాపకం. పెట్టెకు వేసిన తాళం వేసినట్టేవున్నది.

సంగతి తెలుసుకున్న శివస్వామి, కమలను ఓదార్చుతూ, "పెళ్ళికి వచ్చిన వారిలో ఎవరు దొంగిలించారో కనుక్కోలేం. ఇప్పుడు కాంతం గారితో ఏమని చెప్పడం? పెళ్ళిలో నగ పోయిందంటే ఆమె నమ్ముతుందా? మనం మోసకారులమనుకుంటుంది. అందుకని, అచ్చంగా అలాంటి చంద్రహారం ఒకటి మనం కొని, గుట్టుచప్పుడు కాకుండా ఆమెకు ఇవ్వటం ఒక్కటే మార్గం!" అన్నాడు.

తరవాత శివస్వామి బయలుదేరి, మధ్యాహ్నానికల్లా ఇంటికి తిరిగి వచ్చాడు. యజమాని మరికొంత అప్పు ఇచ్చాడనీ, ఇంటిని తాకట్టు పెట్టి మిగిలిన డబ్బు తెచ్చాననీ, అతడు కమలకుచెప్పాడు. భార్యాభర్తలిద్దరూ చాలా దుకాణాలు తిరగ్గా, ఒక దుకాణంలో వాళ్ళకు కావలసిన చంద్రహారం దొరికింది.

ఆ సాయంత్రమే కమల, కొన్న చంద్రహారాన్ని పక్కింటావిడ కాంతానికి ఇచ్చింది.

రెండు రోజుల తర్వాత కమల పని మనిషిని మాన్పించి, తన ఇంటి పని తనే చేసుకోవటం మొదలుపెట్టింది. ఖాళీగా వున్న పెరట్లో కూరలపెంపకం ప్రారంభించింది. కొబ్బరి ఈనెలు తెప్పించి చీపుర్లు చేసి దుకాణాల్లో అమ్మించసాగింది.శివస్వామి ఈపనుల్లో భార్యకు చేదోడువాదోడుగా వుండేవాడు.

ఇలా ఐదుసంవత్సరాలు గడిచాయి.తీరని పనుల వత్తిడితో కమల నాజూకుతనంచాలా వరకు హరించుకు పోయింది. ఒకప్పుడు అద్దంలో గంటలకు గంటలుచూస్తూకూర్చునే

కమలకు, ఇప్పుడు తన అందం గురించి ఆలోచించటానికి కూడా వ్యవధిలేదు. ఇప్పుడామెకు తన జీవితం పట్లఎటువంటి అసంతృప్తిలేదు.

ఒకనాడు కమల, తామింతవరకు కూడబెట్టిన డబ్బును పెట్టెలో నుంచి తీసి లెక్కపెట్టాక, పట్టరాని ఆనందంతో కేకపెట్టింది. ఆ డబ్బుతో, పోయిన చంద్రహారం కోసం చేసిన అప్పు తీరిపోతుంది; ఇంటిని తాకట్టు నుంచి విడిపించవచ్చు!

పనినుంచి ఇంటికివస్తూనే, కమలనుంచి ఈ సంతోషవార్త విన్న శివస్వామి, "కమలా, అరువుసొమ్ము బరువుచేటన్నారు పెద్దలు. అప్పటి పరిస్థితుల్లో, ఈ వాస్తవం చెప్పినా ప్రయోజనం వుండదని, నాకు తెలుసు. క్షమించగలవన్నధీమాతో,ఈ సంతోష సమయంలో ఒకనిజం చెప్పదలిచాను," అన్నాడు.

"ఏమిటానిజం?"అంటూఆతృతగా ప్రశ్నించింది కమల.

"చంద్రహారాన్ని ఎవరూ దొంగిలించలేదు. స్నానానికి వెళ్ళి బావిగట్టు మీద నువ్వు దాన్ని మరిచిపోయావు. నేను చూసి దాచాను. పట్నంవచ్చాక దాన్ని నగలదుకాణంలో ఇచ్చాను. ఆ దుకాణదారుడు, నా మిత్రుడే! వాడమ్మి నట్టూ, నేను కొన్నట్టూ నటించాం, అంతే! మన ఇల్లు తాకట్టు పెట్ట లేదు, నేను అప్పు చేయనూ లేదు. కనక,ఈ డబ్బుతో ఆనందంగా నీకు కావలసిన నగలు చేయించుకో,"అన్నాడుశివస్వామి చిరునవ్వునవ్వుతూ.

కమల ఒకటి రెండు క్షణాలపాటు ఆనందంతో పరవశించిపోయింది. తర్వాత భర్త రెండు చేతులూ పట్టుకుని కళ్ళకద్దుకుని, "ఒకప్పుడు నేనెంత అమాయకురాలినీ, అహంకారినండి! పోనిద్దురూ, ఆదేవుడిచ్చిన అందం ఇంకా ఈ వయసుకు తగినట్టుగానే వుంది. తళతళలాడే నగలూ, చీరెలూ నాకెందుకు? ఈ డబ్బుతో ఒక చిన్న కొబ్బరి తోట కొనుక్కుందాం. షావుకారు దగ్గర ఉద్యోగం మానేసి తోటపనో, వ్యాపారమో చూసుకోండి. ముందు ముందు డబ్బు అవసరం మనకెంతైనా వుంది, తెలిసిందిగదా! ఇద్దరం ముగ్గురం కాబోతున్నాం," అని ముసిముసి నవ్వులు నవ్వింది.

ఈ కొత్త కమలకూ, నగ పోకముందున్న కమలకూ ఎక్కడా పోలిక లేదనుకుంటూ, శివస్వామి తృప్తిగా తలాడించాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1997 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



MAHANTESH C. MORABAD



K. SUBBA RAO

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చదువు నీ లక్ష్యం!
రెండవ ఫోటో : ఆటలు కూడా ముఖ్యం!
పంపినవారు : శ్రీమతి అద్దంకి సీతాదేవి, లెక్చరర్
ప్రజ్ఞ జూనియర్ కాలేజి,
మలక్‌పేట, హైదరాబాద్- 500 036



Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026 (India), Controlling Editor: NAGI REDDI.

# ఎల్ఐసి అంటే సంరక్షణ




ఫాస్ట్ బాల్ మీవైపుకు దూసుకొస్తున్నప్పుడు, మీరు కట్టుకొనే ప్యాడ్స్ మీ కాళ్ళను మాత్రమే కాపాడుతాయి. కానీ ఎల్ ఐ సి, అంటే లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ అయితే మీ జీవితకాలమంతా మీకు సంపూర్ణ సంరక్షణను అనుగ్రహిస్తోంది.

ఎల్ ఐ సి పాలసీ అంటే అస్సలేమిటో, మరి ఇది ఎలా మీకు సంరక్షణను మరియు భద్రతను ఇస్తుందో అనే విషయాలను మీ తల్లిదండ్రుల్ని అడిగి తెలుసుకోండి. ఎందుకంటే; ఎల్ ఐ సి మిమ్మల్ని కంటికి రెప్పలా కాపాడుతుంది గనుకనే.



లైఫ్ ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

భీమా చేసి భద్రత పొందండి.

R K SWAMY/BBDO LIC 5824 TEL